# ఉద్యానం

కథాసంపుటి

పురాణం
కుమారరాఘవ శాస్త్రి, బి. ఏ.

*



వాడపల్లి హౌస్
బెజవాడ : కృష్ణా
౧౯౪౧

# మాంగల్యం

రాత్రి ఎనిమిదిగంట లౌతుంది. అప్పుడే భర్త భుజించి వెళ్ళిన విస్తరిలో అన్నం వడ్డించుకుంటోంది బాల వంటింట్లో.

మేడ్లో మంచం వాల్చుకు కూచున్నాడు రామనాథం. పదినిమిషాలకిందట అతను భోజనంచేసి వీథవాకిట్లో చెయి కడుక్కుంటోన్నప్పుడు మిత్రుడు శేఖర్ ఆదారిన వెళుతూ — వెళ్ళేవాడు పూర్తిగా వెళ్ళిపోయినా బాగుండేది—తీరా అతన్ని సమీపించి 'ఇదిగో, రామనాథ్, ఈరాత్రి క్లబ్బులో ఆటవేస్తున్నాం; పెద్దపెద్దవాళ్ళు వస్తారు; జాగీర్దారుగారి అబ్బాయికూడా; నీవుకూడా రా, ఏం!' అంటూ చెవిలో ఊది వెళ్ళాడు. మిత్రుడు మహాసంతోషంతో చెప్పివెళ్ళిన ఈ సమాచారంవల్ల రామనాథ్ హృదయంలో మూసిపోయినగాయం మళ్ళీ సెలవేసింది. అనేక భావతరంగాల్లో ఊపిరాడకుండా అయిపోయాడు. మోకాళ్ళమీద మోచేతు లానించి, ఊర్ధ్వకాయం వాచి, అరచేతుల్లో చెంప లానించి కూచున్నాడు. ముఖంలోనించి దీనత్వం తొంగిచూస్తోంది. విచారంగా నేత్రాలు నేలను చూస్తున్నై.

తననూ తండ్రినీ వేరుచేసిన — తండ్రివద్దనుంచి పంచుకు వచ్చిన ఇరవై అయిదు ఎకరాల మాగాణిభూమిని హరించుకుపోయిన — ఆఖరికి బాలమెడలోని సొమ్ము లన్నింటినీ విక్రయం వించిన — అప్రాచ్యపు పేకాట ఇక ఆడకూడదని నెలరోజుల ద నిశ్చయం చేసుకున్నాడు, రామనాథం. కాని శేఖర్

ఆ వార్త చెప్పివెళ్ళిన తర్వాత 'ఆటకు వెళదాం' అనే ఉత్సాహం మెల్లిగా తలెత్తింది.

అప్పుడు అనుభవజ్ఞానం ముందుకు వచ్చి పలికింది. 'జాగ్రత!. ఇంతనష్టము అనుభవించికూడా నీకు బుద్ధి రాలేదే! నీధనం పోయినదారినే నీ అంతరాత్మకూడా పోయిందా? ఆలోచించుకో;. నీశరీరదార్ఢ్యము అడగిపోయినది - నీ గౌరవము వడగాలికి కొట్టుకుపోయినది - నీముఖం ఇనుపగజ్జెలతల్లికి నాట్యరంగమైనది - పేకాటవల్ల కాదూ? నీపూర్వులు చెమటోడిచి సంపాదించిన - ఇన్నాళ్ళూ భద్రంగా రక్షింపబడుతూ వచ్చిన ధనం- ఒక్కనిమిషంలో; కన్నుమూసి కన్నుతెరిచేలోగా: 'ట్రాన్స్ఫర్' దస్తావేజులు రాయటానికి కాగితం కలం తెచ్చేపూర్వమే, దమ్మిడీ మిగలకుండా నీచేతుల్లోనుంచి జారిపోయింది కదూ! ఆడి ఆడి ఓడిపోవటంతప్ప నీ కేమి లాభం కలిగింది? ఈసారి గెలుస్తానేమో, ఈసారి గెలుస్తానేమో అనే వ్యర్థయాసలకు పోయావేకదూ! ఈ యౌవనదశలో జ్ఞానోపార్జన మాట సరికదా పాపం! పేక కలపడంతో, దురదృష్టానికి వగవటంతో, ఒకవేళ గెల్చినా స్వల్పలాభమేనని నిరుత్సాహ పడటంతో, వృథా కాలక్షేపం చేశావు. జాగ్రత! జూదం అపకీర్తికరమైన, రుచిలేని వినోదం; సమూలనష్టప్రదం.'

'అబ్బ!' అని వుచ్చరించి పెద్ద నిట్టూర్పు విడిచాడు రామనాథం - ఎంతో బరువు మోస్తూ అలసిపోయిన వాడువలె.

మంచంమీదినించి లేచి అటూ యిటూ పచార్లారంభించాడు. తండ్రితో వేరుపడి గడచిన రెండు సంవత్

రాల్లో తాను గావించిన అవజ్ఞత అంతా తలపుకు వచ్చి చెప్ప రాని మనోబాధ అనుభవించాడు. అటునుంచి తనఆలోచనలను మరలించుకోవాలని ప్రయత్నం చేశాడు.

దక్షిణపువేపు కిటికీచువ్వలు పట్టుకొని అవతల ఖాళీ స్థలంలోకి చూపులు ప్రసారించాడు. వెన్నెల చక్కగా కాస్తోంది బైట; ప్రశాంతంగా ఉంది. చల్లని పిల్లగాడ్పులు లోపలకు వీస్తూ అతనిముఖానికి కాస్త తేట చేకూర్చినై.

"ఇప్పుడు సుమారు ఎనిమిదిన్నర ఔతుంది" అని గొణుక్కున్నాడు రామనాథం.

"ఔను, ఇంకో అరగంటకు ఆట మొదలుపెడతారు క్లబ్బులో" అని తెరచాటునుంచి మోహమాయ ఊరించింది.

"నేనూ వెళ్ళనా ఏమిటి ?"

"ఈ ఒక్కరాత్రి ఆడివచ్చినంత మాత్రాన ఏ మంత వ్రతభంగ మౌతుందా ?"

"మరి నావద్ద చిల్లిగవ్వకూడా లేదే!"

"బాలను అడిగి చూడు"

"ఏముంటుంది పాపం దానిదగ్గర! ఉన్న సొమ్ము లన్నీ ఇవ్వనే యిచ్చింది"

"మిగిలి ఉన్న దింకా మెడలో —"

"మన స్వప్నటం లేదు"

"అలా గనకు మరి! ఈసారి నీఅదృష్టం బాగుండ వచ్చు. నిరుత్సాహపడకు"

"ఎలాగైనా ఈరాత్రి ఆటకు వెళ్ళాలనే అనిపిస్తోంది"

రామనాథం వెనక్కితిరిగి పడకగది గుమ్మం దగ్గరకు వచ్చాడు. లోపల పక్క వేస్తోంది బాల. అప్పుడే భోజనం చేసి, వంటయిల్లు సర్దుకుని వచ్చిందామె.

* * *

బాల వట్టి అమాయికపుపిల్ల. అల్పసంతోషిత్వం, నిత్య ప్రసన్నత తొంగి చూస్తుంట వామెకన్నుల్లోనించి. ఎంతపాషాణ హృదయాన్నికూడ ద్రవీభూతము చేయగలిగినది ఆమెయాస్య బింబం. పేకాటలో భర్త స్థిరాస్తినేకాక, ఇంటిలోని సామాన్లు కూడ కోలుపోయాడు. ఆరునెలలనించీ తిండికికూడా గడవని చెడురోజులు దాపురించినై. తనసొమ్ములనూ, భావిసౌభాగ్యాన్నీ ఆవిధంగా దోచేస్తున్న మొగుణ్ణి పల్లెత్తుమాట అనలేదా యిల్లాలు. ఉన్నంతవరకు భర్తకింత వండిపెట్టడం, అన్నివిధాలా అతన్ని సంతోషపెట్టడం తప్ప, మరె ఆమెకు వేరే ప్రపంచం తెలియదు. ఇటువంటి ముద్దరాలు ఈనవయుగంలో ఎలా జన్మించిందా అని ఆశ్చర్యపడుతుంది నేటి మహిళామండలి.

బాల అత్తమామల మనసు కెక్కిన కోడలు. కొడుకును కంటే వాళ్ళామెను ఎక్కువ ఆదరంగా చూచేవాళ్ళు. రామనాథం తండ్రితో ఆస్తి పంచుకొని, ఆవూరులోనే యింకో యింటోకి కాపురానికి వెళుతోన్నప్పుడు అత్తగారు బాలను కౌగలించుకొని ఎంతోసేపు ఏడ్చింది. ఇప్పటికీ ఆమె అప్పుడప్పుడు బాలను చూడ్డానికి వచ్చి యోగక్షేమాలు కనుక్కొని

పోతూంటుంది. కోడుకు స్థితి యెంతవరకు వచ్చిందో తెలుసును కాబట్టి కోడలు ఇంటో ఏమికష్టపడుతుందో అని అప్పుడప్పుడు కొంతడబ్బు ఇచ్చిపోతూంటుంది. దానితో బాల వీలైనంతవరకు భోజనపదార్థాలు కొనేది; ఇంకా కొంచె మేమైనా మిగిలిఉంటే దాన్ని భర్త వచ్చి సొంతఖర్చులకో, పేకాటకో అడిగితే ఇచ్చే సేది. సర్వమూ కోలుపోయిన ఆస్థితిలో రామనాథం వేళ కింత భోజనం చేయగలుగుతున్నాడంటే, అది బాల చలవ.

తండ్రికిమాత్రం రామనాథం దుస్థితికి జాలి కలగలేదు. తల్లి ఈవిధంగా కొంతడబ్బు బాలకు ముట్టజెబుతోందని ఆయ నకు తెలిస్తే కోప్పడేవాడేమో కూడా. బాలయెడల ఆయనకు ఆదరం వాత్సల్యం ఉన్నా రామనాథం ఇంకా బాగా కష్టాల రుచి తెలుసుకుంటేనేగాని దారికి రాడని ఆయన ఉద్దేశం. చిల కకు చెప్పినట్టు చెప్పాడు—పేకాట మనకు తగదురా నాయనా! దానివల్ల అనేకమంది లక్షాధికారులు భిక్షాధికారు లయారు. అది దారిద్ర్యాంధకారకుహరాలకు దారి తీస్తుంది, దుర్మార్గాన్ని ప్రబోధిస్తుంది, వ్యభిచారదోషాన్ని నెత్తికె కట్టబెడుతుంది, జాగ్రత! తరువాత పశ్చాత్తాపపడి లాభంఉండదు — అని

కాని రామనాథం విన్నాడా? గురువచన మత్యంతనిర్మల మైనా శ్రవణాస్థితసలిలములాగ అభవ్యునికి పోటు పుట్టిస్తుం దంటారు. అలాగే అయింది; తన మేలుకోరిన తండ్రిగారి హిత బోధ తోసిపుచ్చాడు. లేసుకోన్న వేసుకొని పెద్దమనుష్యులవలె నటిస్తూ తన్ను జూదంలోకి దించిన మిత్రుల్ని గౌరవనీయులని

విశ్వసించాము. ధనవంతుని పుత్రుడు కావటంచేత ఒకానొక ప్రయోజనం కోరి వాళ్ళుతన్ని వాగురలోకి పట్టుకున్నారు. స్వతహా రామనాథం సరళస్వభావుడు; చాల నెమ్మదైనవాడు; సులభంగా నమ్మేవాడు. ఈసద్గుణాలే అతన్ని దుర్బలుణ్ణి చేసినై. చూపులకు పెద్దమనుష్యులుగానూ, సుజ్ఞానులుగానూ అగపడుతోన్న మిత్రులు నీతిపథంనించి తప్పరనుకొని మోసపోయాము. వాళ్ళుతన్ని పూర్తిగా ముండనం చేశారు.

ఈ స్నేహితులమూలాన్నే తండ్రీ కొడుకులు వేరు కావలసి వచ్చింది. తాళపుచెవులు తండ్రిచేతుల్లో ఉన్నంతకాలం రామనాథం విరివిగా డబ్బు ఖర్చుచేయటానికి వీలుండదు; అతని చేతుల్లో పుష్కలంగా డబ్బు మెదులుతూంటేనేగాని తమకు లాభించదాయెను; అందుచేత రామనాథానికి బాగా బోధచేసి. తండ్రినించి విడదీశారు. ఎంత చెప్పిచూచినా లాభం లేకపోవటంచేత 'పోనీ, మొట్టికాయలు తిన్నతర్వాతైనా బుద్ధి తెచ్చుకుంటాడేమో' ననుకుని తండ్రికూడా కొడుక్కు ఆస్తి పంచి యిచ్చేశాడు. రామనాథం ఆఊళ్ళోనే ఇంకోయింటో కాపురం పెట్టాడు.

తండ్రి ఎలాగయినా జాగ్రత్తగల మనిషి; అనుభవం కలవాడు. పంచుకుపోయిన ఇరవై అయిదు ఎకరాల భూమిని కొడుకు నిలుపుకోగలుగుతాడనే ధైర్యం ఆయన కెప్పుడూలేదు. అందుచేత తాను గుప్తంగా ఒక బ్యాంకులో దాచివుంచిన యాభై వేల రూపాయల రొఖ్ఖంలో కొడుక్కు భాగ మేమీ

ఇవ్వలేదు. ఆయనవద్ద ఆరోఖ్యం ఉన్నట్టు రామనాధానికి తెలియదు.

రామనాధంభాగానికి ఇరవై అయిదు ఎకరాల సుక్షేత్రమైన మాగాణిభూమి వచ్చింది. స్వేచ్ఛ లభించింది. తండ్రిపోరు ఇక తనకు లేదు. ఇంకేం కావాలి?

రోజులు గడిచినకొద్దీ ఒక్కొక్క మొకరమే అమ్మజూపుతూ వచ్చాడు రామనాథం. తండ్రి కుమారుడి ప్రవర్తన ఒకకంట కనిపెడుతునే వున్నాడు. కొడుకు అమ్మిన యిరవై అయిదు ఎకరాలనూ ఆయన తనవద్దవున్న రొక్కం ఇచ్చి స్నేహితుడైన ఒక మోతుబరి ఆసామిచేత కొనిపించి, తిరిగి తన స్వాధీనం చేసుకున్నాడు. అలాగ పూర్వార్జితమైన ఆభూమిని పరహస్తగతం కాకండా కాపాడుకున్నాడు. ఈసంగతి రామనాధానికి తెలియదు. రామనాధాని కేమిటి, రెండోకంటివాడికి తెలియదు. రామనాధం పూర్తిగా నిర్ధనుడై, వేరుసు తిండికి కూడా మొగంవాచి, కష్టాలనుభవించి, బుద్ధి వచ్చి, మళ్ళీ తన కాళ్ళముందుకు వస్తే, అప్పుడా ఇరవై అయిదు ఎకరాల భూమినీ - అతని కివ్వాలనికాదు - బాలపేర పెట్టేస్తే, అమ్మో కోటానికి వీలుండదనీ, భోజనానికి అవస్థ పడకండా గడిచిపోతూంటుందనీ, తండ్రిగారి ఆలోచన.

ఈవిధంగా అత్తమామల ఆదరణానికి పాత్రురాలైన స్త్రీ లోకంలో అరుదుగా ఉంటుంది. అంతేకాదు, ఒకజూదరికి భార్యయై, రోజూ భర్తగారి కాలితాపులు తినకండాఉండే

యువతి బాలతప్ప ఎవ రున్నారు! రామనాథం హృదయంలో ఆమె కొక గౌరవస్థానమే ఉంది. ఆమెసన్నిధిలో అతనికి తన అసభ్య ప్రవర్తనలకు పశ్చాత్తాపం కలుగుతూంటుంది. సర్వనష్ట ప్రదమైన పేకాటమీద అతనికి విరక్తి కలగటానికికూడా కారణం ఆమె నేత్రగోళాల్లోని పవిత్రతాజ్యోతే.

*　　　*　　　*

బాల దుప్పటి దులిపి పరుపుమీద పరుస్తూ గుమ్మంము వద్ద నిల్చివున్న రామనాథాన్ని చూచింది.

"పడుకుంటారా? అప్పుడే నిద్ర వస్తోందేమిటి" సహజ మందస్మితంతో బాల అడిగింది.

"బాలా!___" తరువాత ఏమి మాట్లాడాలో అతనికే తోచలేదు. చూపుల్ని ఆమె ముఖంమీదనించి పక్కకు తిప్పు కున్నాడు రామనాథం.

"ఏమిటి? అలా ఉన్నారేం? సుస్తీగాఉందా?" అంటూ సగం పరచిన దుప్పటి అలాగే ఉంచి బాల అతనిముందుకు వచ్చింది.

రామనాథం మౌనంగా లోపలకు వచ్చి కూచున్నాడు మంచంమీద. బాల అతని పాదాలదగ్గర నేలమీద కూచుని తలెత్తి అతనిముఖంలోకి ఆదుర్దాగా చూస్తోంది.

ఒకానొక లజ్జాకరమైన కార్యము తప్పనిసరిగా చేయ వలసివచ్చి అవనతముఖుడై నిల్చిన పాపభీరువువలె ఆగదిలోని గాలి స్తంభించిపోయింది.

కొంతసేపటికి—

"బాలా! నీవద్ద చిల్లరడబ్బులుకూడా ఏమీ లేవా?" రామనాథం అడిగాడు.

"అయ్యో, లేవే. ఒక్క అణా ఉంటే ఇందాకనే ఉప్పు కొన్నాను. అయినా, మీ కేమి కావాలి ఇప్పుడు?"—సానునయంగా మధురంగా ఉన్నై మాటలు.

రామనాథం వెంటనే జవాబు చెప్పలేదు. "బాలా, నా కీరాత్రి ఆటకు వెళ్ళా లనిపిస్తోంది" అన్నాడు చివరకు.

పేకముక్క లిక ముట్టుకోనని భర్త నెలరోజులకింద పశ్చాత్తాప సూచకంగా చెప్పినమాట లామెకు తలపుకు వచ్చినై. అమర్వ్యసనం మళ్ళీ ఇప్పుడు ఆయనలో మొలకెత్తినందుకు ఆమె మనస్సుకు కష్టమనిపించింది. కాని ఆమె అడ్డుమాట ఏమీ చెప్పలేదు. హితబోధకూ పూనుకోలేదు. అసలు భర్తను పేకాటనుండి మరలించటానికి ఆమె చేసిన ప్రయత్న మెప్పుడూ లేదు.

"నావద్ద మరి దమ్మిడీకాసుకూడా లేకండా వచ్చిందే" అన్నది; అంతే.

అప్పుడు రామనాథం ఆమెచుబుకాన్ని మునివేళ్ళమీద ఎత్తిపట్టుకొని, "బాలా!" అని సంబోధించి, ఏమో చెప్పబోతూ, చెప్పలేక, ఆమెకంఠంకేసి ఒకతీరుగా చూచి ఊరుకున్నాడు.

బాలకు అర్థమయింది. ఆయనకు జూదంమీద పూర్తిగా విరక్తి కలగనీకండా ఇంకా తన మాంగల్యం ఒకటి ప్రతిబంధకంగా ఉన్నట్టు ఆమెకు విశదమయింది. దాన్నికూడా త్యాగం చెయ్యి అని ఆమెహృదయతంత్రీనాదం మోగింది.

వెంటనే బాల లేచి లోపలికి వెళ్ళింది. ఒకదారానికి పసుపు రాచి, దానికి మధ్యన పసుపుకొమ్ము కట్టి తెచ్చింది. దాన్ని భర్తచేతి కిచ్చి "ఇది నామెడలో కట్టి అది విప్పుకు పొండి" అన్నది.

పెండ్లిలో తాను ముడివేసిన మంగళసూత్రాన్ని మళ్ళీ ఈనాడు తానే విప్పుతోన్నప్పుడు రామనాథం లజ్జ, నీచత భరించలేక పోయాడు. కాని ఆటమీది వ్యసనం అతన్ని పూర్తిగా లోగొన్నది.

రామనాథం గడప దాటాడు.

* * *

సొమ్ము లన్నీ ఊడ్చిపెట్టుక పోయినా కలగని దుఃఖం ఆరాత్రంతా బాలను కలవర పెట్టింది. దిండు పూర్తిగా అశ్రుసిక్తమై పోయింది.

అత్యంత వైభవంగా జరిగిన తన వివాహమహోత్సవంలో పెండ్లిపీటలమీద తాను తీయనితలపులు చిగిర్చుతోన్న హృదయంతో, సిగ్గుచేత ఎర్రబడ్డ బుగ్గలతో, కూచునిఉండగా రామనాథం తన కంఠముచుట్టూ హస్తాలు పోనిచ్చి మూడు ముళ్లువేసిన తాళి ఇప్పుడేదీ? ఇన్నాళ్లూ తాను పసుపుకుంకుమ

లతో పూజించుకుంటోన్న పవిత్రనిధాన మే మయింది? అది తిరిగి తనకు లభిస్తుందా? మళ్ళీ తా నది మెడలో ధరించుకో గలదా?

భర్తఆస్తి, ఇంటోవస్తువులు, తనసొమ్ములు - సర్వమూ పోయినా ఆమె కెన్నడూ విచార మన్నది కలగలేదు. తనమాంగ ల్యంకోస మామె ఆరాత్రి ఎంత తహతహ లాడింది।

* * *

తెల్లవారబోతోంది; అంధకారయవనికలు ఒక్కొక్కటే విడిపోతున్నై. క్లబ్బులో ఆట ముగిసింది; రామనాథం ఇంటికి వస్తున్నాడు. నాటిరాత్రి ఆటలో రామనాథానికి ఎన్నడూ కల గని అద్భుతవిజయం కలిగింది. మొదటిఆటకు భార్యమాంగ ల్యాన్ని పందెం ఒడ్డాడు. మిగతా ఆటగాళ్లు ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. కాని రామనాథానికే గెలుపు. మాంగల్య ప్రభా వమో, మరేమో, రామనాథం మొత్తంమీద ఏ నాలుగైదు ఆటలో ఓడాడు, అంతే గెలుపంతా అతనిదే.

ఇప్పు డతడు ఇంచుమించు ఇరవై ఐదు వేల రూపా యల రొక్కంతో ఇంటికి వస్తున్నాడు. అత డిదివరకు పేకాటలో పోగొట్టుకున్న ఆస్తివిలువ అంతా ఒక్కరాత్రి అతనికి వచ్చేసిం దన్నమాట.

కాని రామనాథంముఖంలో సంతోషం తాండవించటం లేదు. జూదంలో ధనం పోగొట్టుకొన్నప్పటి దుఃఖ మతడెరుగును. పరధనాన్ని జూదంలో గెలవట మనేది తనవంటివాని కంత

సంతోషకరం కాదని ఇప్పుడు బోధ పడింది. పురుషకారముచేత కాక, ఇతరదుష్కార్యాలచేత ఆర్జించబడ్డధనాన్ని అనుభవించా లంటే మనస్సు చివుకు మనదూ? ఏమిచేయాలి ఈధనాన్ని?

ఆటకు వెళ్ళేంత వరకూ నిలువు లేకపోయింది. వెళ్ళి అంత డబ్బు గెల్చివచ్చినా సంతోషం లేకుండా ఉంది. తన మనః ప్రకృతి తనకే విచిత్రంగాఉంది. గెల్చిన సంతోషం ఉండనప్పుడు ఆటమీద అంతవ్యసనం ఎందు కుండాలి?

* * *

రాత్రి రామనాధం ఆటకు వెళ్ళినతర్వాత వీధితలుపు గడియ వేసుకోవాలన్నమతే లేకపోయింది బాలకు. తెల్లవారు తోన్నప్పుడు రామనాధం వచ్చి తలుపు తోసుకుని లోపల ప్రవేశించేవరకూ ఆమె యేలోకంలో ఉన్నదో భగవంతుడికే తెలియాలి.

భర్త వచ్చిన అలికిడి వినగానే బాల పక్కమీదినించి చివాలున లేచివచ్చి "వచ్చారూ, తెచ్చారా, ఏదీ నా మంగళ సూత్రం" అంటూ అతని మోకాళ్ళు గట్టిగా కావిలించుకుని కూలబడ్డది.

బాల అదివర కెన్నడూ అంతగా ఉద్రేకించలేదు. రామనాధాని కాసంగతి తెలుసు. నిద్ర లేకపోవట మటుండగా ఏడ్చియేడ్చి ఆమెనేత్రాలు ఎర్రబడిపోయినై. సాక్షాత్తూ శోక దేవతవలె ఉన్న అప్పటి యామెరూపము అతనిహృదయంలో

నించి కరుణారసాన్ని వెలికి లాగింది. కన్నీటిచుక్కలలని నేత్రాలలోనించి జారి ఆమె సీమంతముమీద పడ్డవి.

బాలహృదయంలోని అమాయికత, పవిత్రత, నిష్కల్మషప్రేమ రామనాథాన్ని ముట్టడించి ఓడించినై. పుస్తకాల్లో చదివిన నీతులు, తండ్రిగారి యుపదేశాలు అతనిలో తీసుకురాలేకపోయిన హృదయపరివర్తన తేగలిగింది, ఆ కరుణామయ ముహూర్తం.

తన సర్వస్వమూ భర్తకోసం త్యాగంచేసి, అతని యభీష్టసిద్ధికై ఎంత దుఃఖాన్నైనా ఆహ్వానించగల సహనశీలి బాల. తానో, ఒకానొక దుర్వ్యసనాన్ని సాధించుకునేందుకు భార్య మంగళసూత్రాన్నికూడా బలిపెట్టటానికి జంకని స్వార్థపరుడు. ఇద్దరి మధ్యనా గల ఈ మహదంతరాన్ని గడచి తాను బాలసామీప్యాన్ని పొందవలసిన ఆవశ్యకత రామనాథం అప్పుడు గుర్తించాడు.

మెల్లిగా వంగి తన పాదాలకడ కూలబడిన బాలను లేవనెత్తాడు. జేబులోనించి మాంగల్యాన్ని తీసి ఆమె మెడలో ముడివేశాడు. బాలసూర్యునికిరణాలు సోకిన పద్మమువలె అయిపోయింది బాల. మాంగల్యాన్ని ఆప్యాయంగా చూచుకుని కన్నుల కద్దుకుంది.

* * *

మర్నాడు రామనాథం, గతరాత్రి పేకాటలో డబ్బు కోల్పోయిన మిత్రు లందర్నీ పిలిపించి వాళ్ళసొమ్ము తిరిగి ఇచ్చి.

వేయటమే కాకుండా ఇక నెప్పుడూ పేకాట ఆడనని వాగ్దానాలుకూడ తీసుకున్నాడు. అతనిలోని ఈ హఠాత్ పరివర్తనకు లోకం సంతోషించి, అందుకు బాల పవిత్రచరిత్రమే కారణంగా చెప్పుకుంది.

అందరికంటే ఎక్కువ సంతోషం రామనాథం తండ్రికి. ఆయన ఆనాడే కొడుకునూ కోడల్నీ, స్వయంగా వెళ్ళి, ఇంటికి తీసుకొచ్చాడు. పెద్దపండగ చేశాడు. అత్తగారి వక్షస్థలాన్ని ఆనందబాష్పాలతో తడిపింది బాల.

* * *

పూర్వము తా ననుకున్నట్లు రామనాథంతండ్రికి కొంత ఆస్తిని బాలపేర పెట్టవలసిన అవసరం లేకనేపోయింది.

* *
*

# రేరయ్య ప్రేమ

చీకటిరాత్రి. పదకొండుగంటలు కావస్తుంది. పోలీసు సబ్ ఇన్స్పెక్టరు సాధారణదుస్తులలోనే, చేతిలో టార్చిలైటు పట్టుకుని, ఊరివెలుపల ముత్రాసుగూడెంలో ఒకచిన్న పాకలోకి జొరబడ్డాడు.

'లైటు' వేసి చూస్తే ఒక కుక్కిమంచం, అక్కడక్కడ వంకెలమీద వేలాడుతోన్న చింకిపాతలు, కుండబొచ్చెలు తప్ప, హంతకు డెవరో తెలుసుకోటానికి ఉపకరించే ఆధారా లేమీ కనిపించలేదు. అయినా హంతకు డెవరో అప్పటికే పోలీసువారు నిర్ణయించుకుని ఉండకపోతేగద! ఆపాకలో — అప్పటికి వారం రోజులక్రితం — గుండెలో బాకు గుచ్చబడి వున్న గంగిశవం కనిపించింది. అప్పటినించి దానిమొగుడు ఎక్కడా పత్తాలేడు. వాడే నేరస్థుడు కాకపోతే — ఖాదిరీగారింట్లో పనిచేస్తూండే వాడు, నౌకరీకికూడా రాకుండా పరారై పోవటం దేనికి? అది కాక ఆబాకు ఖాదిరీగారు తన్నొకనాటి అడవిలో ఎలుగుబంటి బారినుంచి రక్షించిన గంగిమొగుడికి బహుమానం చేసినట్టు తేలింది కూడాను.

ఇప్పుడు ఇన్స్పెక్టరుగారు అక్కడికి రావటానికి కారణం ఏమంటే — ఒకవేళ గంగిమొగుడు ఏ దూరదేశాలకో పారిపోకుండా ఉన్నట్టయితే, పగల్లు చుట్టుపక్కల ఏ అడవుల్లోనో దాక్కుని వున్నా, రాత్రిళ్ళయినా సొంతపాకలో తలదాచు

కునేందుకు వస్తాడేమో (అదైనా నమ్మకంలేదు), అలా వచ్చి నట్టయితే పట్టుకుని ఖైదు చేయవచ్చు నని ఆయనఉద్దేశం.

ఒకమూల తడికెలడ్డంపెట్టి వాటకో, ఎడకకో ఒకగదిగా ఏర్పాటు చేయబడిఉంది. అందులోకకూడా వెళ్ళి చూద్దా మనుకున్నాడు ఇన్స్పెక్టరు. ఇంతలో బైట ఎవరో వస్తోన్నట్టు అలికిడయింది. "ఇంకేం, వాడే" అనుకొని ఇన్స్పెక్టరు వెంటనే 'లైటు' తీసేసి, చప్పున ఒకమూల దండెంమీదఉన్న పాత ముతక ధోవతి ఒకటి ఆరవేసినట్టుగా ఉంచి, దానివెనక ఒదిగి పోయాడు. ఆయనలో నూతనోత్సాహం పొంగు లెత్తసాగింది. తన కీక సాటియుద్యోగస్థులలో ఎక్కువ గౌరవం దొరుకుతుంది. హంతకుణ్ణి పట్టుకో బోతున్నాడు...కాని వాడు తనకంటే బల వంతుడేమో!...ఉందిగా పిస్తోలు!... ఒకసారి కోటు లోపలి జేబు తడివి చూచుకున్నాడు.

పాకగుమ్మంముందు :

"నాకు లోనకు రావటానికి బయంవేస్తుంది ఈరయ్యా! నువ్వు చూళ్ళేదేంటి? లోన ఏందో తెల్లంగ తళుక్కుమని మళ్ళ నల్లగై పోయింది. గంగి జెయ్యం కాబోలు బాబో!"

"అయితేమాత్రం బయమేంటి ఎల్లీ! రా" — లోనికి అడుగు వేశాడు ఈరయ్య.

" అదేంటోగాని ఈరయ్యా! నీతోపాటగ పెద్దపులి నోట్లోకైనా దూకాలంటే సరే నంటది నాగుండె" అంటూ అతనిభుజం అవలంబంగా వెంట నడిచి వస్తోంది ఎల్లి.

కొంతసేపటి నించీ చీకటిలో చూడ్డం అలవాటుపడ్డ ఇన్స్పెక్టరుగారి కన్నులకు వాళ్ళిద్దరూ నడుస్తోన్న నీడలవలె—ఆయన తన కష్టండుంచుకొన్న ధోవతిచినుగుగుండా—కనిపించారు. ఆయనయాశలు కూలిపోయినై. ఈరయ్యట! అది గంగి మొగుడిపేరు కాదే! వీళ్ళెవరో తన టార్చిలైటు వెలుగును కూడా దయ్యంగా భావిస్తోన్న అనాగరిక కాముకులై ఉంటారు. ఎవ్వరూ లేక శూన్యంగా ఉన్న యీపాక తమ రహస్యప్రణయ వ్యాపారాలకు అనువైనదిగా తలచి వచ్చారు. కాని హంతకుణ్ణి పట్టుకోవాలని వచ్చినవాడు తా నావిధంగా నిలువుజీతం పుచ్చుకొని, వాళ్ళప్రణయసల్లాపాల్ని వింటూ ఎంతసేపుండాలో! అయినా కానీ, ఇదెంతవరకు వినోదకరంగా ఉంటుందో.

ఈరిగాడు పక్కమంచంలో కూలబడుతూ అన్నాడు: "బయమెందు కెల్లీ! గంగి బతికుండగా ఎంత సాదువో దయ్యమైనా అట్టనే వుంటది. దాని దయ్యమైనా ఇప్పుడు నాకు కనిపిస్తే బాగుండు. గంగి మన కింక ద్రేహంతో కనిపించదుకదా!"

ఎల్లి అతగాడిముందు నేలమీద కూచుని తన రెండు చేతులూ వాడితొడమీద ఉంచి, "ఏంటి ఈరయ్యా! అస్తమానం 'గంగి' 'గంగి' అంటూ కలవరిస్తవు? సూపులకి నాకంటే బాగుంటదేటి గంగి?"—వాడిముఖంలోకి చూస్తో అడిగింది.

భేష్! గంగిమొగుడు పెళ్ళాన్ని ఎందుకు హత్యచేశాడో కారణంకూడా ఇక్కడ తేలిపోయింది ఇన్స్పెక్టరుకు. గంగి ఈరిగాణ్ణి కామించింది; అది దాని మొగుడికి ఈర్ష్య, కోపం రేపింది.

"నీ నేస్తురాలు సచ్చిపోయిందంటే నీకు విచారం లేదంటే ఎల్లీ!"—ఈరిగా డడిగాడు.

"అయితే నేను సంపా నంటవేంటి?"

"పోలీసోరికి గంగిమొగుడిమీద అనుమానం. వారు తెలుసుకుంటే అతగాణ్ణి ఎన్నటికేనా పట్టుకోగలరు. అతన్ని మనం కాపాడాలి"

"అందుకని ఈ ఖూనీ నానెత్తికి కట్టాలని సూత్తున్నావా?" ఎల్లిగుండె డడదడ కొట్టుకుంది.

ఈరిగాడు పెదవిచివర నవ్వుతూ దానివీపు తట్టి అన్నాడు: "అదికా ఎల్లీ! నీకు నే నంటే ప్రేముందా లేదా, చెప్పు మొదట?"

"బగవంతుడికి తెల్సు! నేను నీకోసం ఎంత తపిస్తున్నానో, గంగి సచ్చిపోయినప్పట్నుంచీ నువు బండి తోల్టంకూడా మానేసి, ఎక్కడా కన్పించకపోతే నా కడుపులో ఎట్టుందని సెప్పమన్నావు! రేత్రిళ్ళు నిద్ర లేదుకదా! ఇందాక మాగుడిసెముంగల సల్ల గాలికి పడుకుంటేనువ్విటుకేసి రావటం కంటపడింది. నిద్రపోలొండ. మా అమ్మను లేపకండా సల్లగా జారివచ్చేశాను. రోజూ చింత కాడ గడ్డిమోపు వేసుకుని గడ్డిమోపుల్లో నీ వొస్తవని కాసు కూసుంటే ఎంతకూ రావు. ఈరేయి గంగి లేదన్న దానికుడి సైనా సూసిపోదా మని వొచ్చావు. నన్ను సూత్తాని కైనా వొచ్చావీరయ్యా! ఔనులే, మొగోళ్ళని కుక్కల్లాగ తిప్పిచ్చుకునే ఆడోళ్లు మంచోళ్ళు. మా అంతట్ట మేం బయటపడితే

సుల్కానే కదా!"

"ఆ గొడవంత దేని క్కానీ, నేను నీకు కావాలంటవా? వొద్దా?"

"నువ్వు లేకపోతే నేను బతకనంటే. మా అమ్మని నొప్పించి నిన్నే పెండ్లి శేసేసు కుంటాను."

"మరి నేను చెప్పినట్లు నడుసుకో. గంగిని నేనే పాడి చేశానని చెప్తాను. నువ్వొల్లానే సాక్షం చెప్పు — నేను గంగిని ప్రేమించాను — బలవంతం చేశాను — అది వొప్పుకోలేదు — తిట్టింది - నాకు కోపం వచ్చేసింది - బాకుతో - తెలిసిందా ఎల్లీ!"

ఆహా! భారతదేశంలో కడజాతివాళ్ళకు కూడా ఇటు వంటి త్యాగబుద్ధి సహజం; ఇన్నేళ్ళక్కడ వొళ్ళు గగుర్పొడిచింది.

ఇంత త్యాగశీలుడు ఎల్లికి తన జీవితంలో ఎక్కడా కనిపించలేదు. దాని ఆశ్చర్యానికి మేర లేకపోయింది. "ఏమి టంటున్నావు ఈరయ్యా!" అంది.

"ఔను నువ్వొల్లానే సాక్షం చెప్పెయ్యి. గంగ మొగుడు బతుకుతాడు. గంగిఆత్మ శాంతిపడతది."

"కాని నిన్ను ఉరితీస్తారు. ఆపైన నేను నుయ్యో, గొయ్యో—"

"ఉరితీస్తే నిచ్చింతగా ప్రాణం విడుస్తా. బతికుండాలని నాకు ఆసలేదు" ఈరిగాడి కంఠస్వరం క్రమేణా స్థాయి తగ్గింది, నిశ్శబ్దనిర్జనారణ్య ప్రదేశంలో ప్రవహిస్తూ అర్థరాత్రప్పుడు నదీమ తల్లి పాడే కన్నీళ్ళపాటలాగ ఉంది ఆతని వాగ్ధోరణి. హృదయం

విప్పి తన విషాద జీవితకథ ఎల్లికి వినిపించాడు. తనకు పద్నాలుగేండ్లువయసు వచ్చేవరకూ తల్లిదండ్రుల పోషణలో ఏమిసుఖం అనుభవించాడో, అంతే. ఆ తరువాత ఈవిశాల ప్రపంచంలో తనమీద ఇంత వాత్సల్యం చిలికిన వాళ్ళెవరూలేరు. తలిదండ్రులు చనిపోతూ తన కొప్పజెప్పి పోయిన మూడేండ్ల చెల్లెలు తప్ప తన్ను ప్రేమించిన వాళ్ళెవరూలేరు. స్వార్థ పంకిలమైన ఈలోకంలో — మాయమర్మాలెరగని తన చిన్నవయసులో — కూలి నాలి చేసుకుని ఎలాగ ఆ చంటి దాన్ని పోషించుకొచ్చాడో భగవంతుడికే తెలియాలి. తల్లిదండ్రులే బతికివుంటే తన హృదయాన్ని ఆ చెల్లెలంతగా ఆకర్షించేది కాదేమో! ఆమెను చూడకుండా క్షణముండలేక పోయేవాడు. పొట్టకూటి యాత్రకోసం తాను రోజూ పడేశ్రమ, యజమానుల అధికార వాక్యాలవల్లనైన సంతాపమూ — సర్వక్లేశాలూ ఇంటికి రాగానే చెల్లెలి సముఖంలో మరచిపోయేవాడు. 'అన్నా' అన్న ఆమెమధుర సంబోధనకు ఉప్పొంగి పోయేవాడు. తనకు బతుకు మీద ఆశ కల్పించిందామె. చివరకొకనికింద కూలికి గుర్రపుబండి తోలుతూ కాస్త బతుకు తెరువు ఏర్పాటు చేసుకున్నాడు. చెల్లెలికి పద్నెనిమిదేండ్లు వచ్చాక ఆమెకు పెళ్ళిచేద్దామని వచ్చే కాసినికూలిడబ్బుల్లో కొంత కొంత మిగిల్చుతూ డబ్బు కూడబెట్టాలని ఎంతప్రయత్నం చేశాడు! కాని ఆమె అకాలమృత్యువువాత పడి తన జీవితం అంధకారమయ మౌతుందని ఎన్నడూ అనుకోలేదు. ఆమె చనిపోయిన తర్వాత ఒక అమూల్యరత్నం పోగొట్టుకున్నవాడు

వలె పిచ్చివాడై తిరిగాడు. చివరకి గంగి వచ్చి తనజీవితంలో మళ్ళీ వెన్నెల కాసింది. గంగిని చూస్తే తనకు చనిపోయిన చెల్లెలు బతికి వచ్చినట్టనిపించేది. గంగి నవ్వితే తన చెల్లెలు నవ్వినట్టుండేది. అందుకనే ఆమెను ప్రేమిస్తూ ప్రపంచములో బతికివుండాలనిపించింది. కాని ఆమెనుకూడా భగవంతుడెత్తుకు పోయాడు. ఇక ఎవరికోసం తాను బతికివుండటం? దేహత్యాగం చేసి తన చెల్లెలు, గంగి వెళ్ళిన లోకానికే తానూ వెళ్ళిపోతే బాగుండదూ!

ఈరిగాడి కన్నులవెంట ప్రవహించి తనచెంపలమీద పడ్డ అశ్రుబిందువుల్ని తుడుచుకుంది ఎల్లి. హృదయం కరుణ రసంతో బరువెక్కగా నిశ్శబ్దంగా కూచుని ఉండిపోయింది. ఎంత మంచివాడు ఈరయ్య! ఎంత చక్కగా ప్రేమించగలడు! అతన్ని చక్కగా తాను అర్థంచేసుకో గలిగినట్లయితే ఇప్పటి కంటె ఇంకా ఎన్నిరెట్లు ప్రేమానుభవం కలిగేదో కదా తనకు! తానూ గంగీ, నావాసంగా గడ్డిమోపు లేసుకుని మార్కెట్టులో ఉంటే ఈరయ్య తనజట్కాను రోడ్డుపక్కన ఆపుచేసి వచ్చి గంగితో కనీసం అరగంటసేపయినా ఏమిటేమిటో మాట్లాడి మోపు కొనుక్కొని వెళ్ళేవాడు. వాళ్ళు మాట్లాడుతూన్నంతసేపూ తనకు మంటల్లో వేగిపోతోన్నట్టుండేది... ఒకసారి గంగి పుట్టింటికి బయలుదేరితే ఈరయ్య తన జట్కాలో తీసికెళ్ళి దిగబెట్టి వచ్చాడు; తను నిజంగా అప్పుడు కోపదేవత అయిపోయింది. మరొకసారి గంగి మొగుడికి జబ్బుచేస్తే, డాక్టర్ని పిల్చుకురావటం మొదలైన సర్వఉపచారాలూ చేశాడు. ఈ గాడి చేష్టలన్ని

అప్పుడు తాను అపార్థం చేసుకుంది. ఈరిగాణ్ణి తన కంటనీకండా లాక్కుపోతోన్న రాక్షసిలాగ కనిపించిం దప్పుడు తనకు గంగి. ఇప్పుడు తెలిసింది ఈరిగాడి గొప్పబుద్ధి. అతగాణ్ణి తన ప్రేమ డోలికల్లో ఊగించుతూ, గతజీవితవిషాదాన్ని మరపించి ఒక కొత్త సౌఖ్యమయ ప్రపంచాన్ని చూపించి అతని సంతోషం కోసం తన జీవితాన్ని వినియోగించటంతప్ప, చేసిన పాపానికి వేరే నిష్కృతి లేదు.

కొంతసేపటికి ఈరిగాడు భావపరివర్తన కనబరుస్తూ అన్నాడు: "గంగిని దానిమొగుడే చంపా డన్నమాట నేను నమ్మలేకపోతున్నా నెల్లీ!"

ఇన్స్పెక్టరు జాగ్రత్తగా వింటున్నాడు.

"ఔను గంగిమొగుడు సంపలేదు." తన గుండెలోని సలుపు ఈరిగాడికి చూపకండా దాచియుంచటం పెద్దపాపం సుమా అని ఎవరో బోధించినట్టయింది ఎల్లికి.

"మరి యెవరంటావు?"

"నేనే" అని వికటంగా నవ్వింది ఎల్లి.

ఇన్స్పెక్టరుకు కూడా నవ్వొచ్చింది.

"నువ్వా? నేను నమ్మను" అన్నాడు ఈరిగాడు.

"ఎవరూ నమ్మరు." ఆమూల ఒకగదిగా ఏర్పాటయేందుకని అడ్డం వుంచబడ్డ తడిక చప్పుడైతే ఆ మూలోనించి ఒకవ్యక్తి బైటికి వస్తూ అన్నాడు. "ఎవరూ నమ్మరు, ఈరయ్యా! ఎల్లీ! మీ రిద్దరూ గంగిని నేను సంపానం టే నేను

సంపానని సెప్పుకుంటూ నన్ను రక్షించాలని సూసినా నే నూరు కోను. నా కోసం మీలో ఎవరు బలైనా నా కేంటి సేమం?"

నూతనవ్యక్తి - హఠాదాగమనంవల్ల ఈరిగాపూ, ఎల్లి చివాలున లేచి నిల్చారు. భయంవల్ల ఎల్లి ఈరిగాడికి దగ్గరగా జరిగింది. మరునిమిషాన ఈరిగాడు ఆశ్చర్యాశ్చర్యకంగా ఉచ్చరించాడు— "ఎవరు ? గంగిమొగుడు!"

ఎల్లి భయంతో ఒణికిపోతోంది.

అప్పుడే ఇన్స్పెక్టరుచేతిలో టార్చిలైటు మెరిసింది. రెండో చేతిలో పిస్తోలుకూడా పట్టుకుని "ఏడీ గంగి మొగుడు ?" అని గంభీరంగా పలుకుతూ ఆయన ముందుకు సాగివచ్చాడు.

కెవ్వున కేకవేసి ఒరిగిపోతోన్న ఎల్లిని ఈరిగాడు చేతుల్లో పట్టుకున్నాడు.

"ఏడీ గంగి మొగుడు ?"

"నేనే నండయ్యా" అని నేల సూస్తూ నిల్చిపోయిన వాడి ముఖంలో — ఇతర్ల కోసం ఆత్మత్యాగం చేయబోయే మహాత్ముల దివ్యతేజస్సు కనిపించింది ఈరిగాడికి.

"వీడు భార్యను చంపలేదు" అన్నాడు ఈరిగాడు అప్రియత్నంగా.

"నీ ముఖం, నోరుమూసుకో" అన్నాడు ఇన్స్పెక్టరు.

తన చేతుల్లో స్మృతితప్పివున్న ఎల్లిని అక్కడి కుక్కిమంచంమీద పడుకోబెట్టాడు ఈరిగాడు.

ఇన్స్పెక్టరు గంగిమొగుణ్ణి ఠాణాకు తీసుకు పోతున్నాడు.

గంగిమొగుడు తనకేసి చూచిన చివరచూపులో "అన్నా! నువ్వు ఎల్లిని పెండ్లాడి నీ జీవితవిషాదాన్ని మరచిపో. అట్లా నిన్ను ఆదేశిస్తున్నది నా స్నేహం. తోసివెయ్యకు. నా కిప్పుడు మృత్యువులోనే పరమానందం కనిపిస్తోంది" అన్నభావం ఈరిగాడికి స్పష్టంగా గోచరమౌతోంది.

పాక వెలుపల నిల్చుని ఈరిగాడు వాళ్లను కనుచూపు మేర దాటి పోయేంతవరకూ చూచాడు — మధ్యమధ్య ఉత్తరీయపు కొంగుతో కన్నీళ్లు తుడుచుకుంటూ. వాళ్లిక కన్పించటంలేదు. ఈరిగాడుమాత్రం అటుకేసే శూన్యంలోకి చూస్తూ నిస్తబ్దుడైనాడు.

అప్పటికే తూర్పువేపు ఆకాశాన ఒక బారెడెక్కివచ్చిన చంద్రబింబం వెలవెల బోతోంది.

లోపల కుక్కిమంచంలో మూర్ఛపడియున్న ఎల్లి కలవరిస్తోంది— "గంగీ! మారులో బాకు నీగుండెలో, నాగుండెలో ఈరయ్యప్రేమ"



# క్రిస్టమస్ సెలవుల్లో

౧

పట్నంనుంచి క్రిస్టమస్ సెలవుల్లో ఇంటికి వచ్చిన మన్నాటి సాయంత్రం, షికారు వెళ్ళి తిరిగివచ్చి—మాయింటి బైటి అరుగు మీద మా అమ్మతో మాట్లాడుతూ కూచున్న ఆమెను చూచినప్పుడు నా మనస్సు ఇదివర కెన్నడూ అనుభూతముకాని ఒక మధుర వికాసానికి లోబడ్డది. వస్తున్న నన్ను చూడ్డంతోనే అరుగుమీదినించి లేచి నిల్చుని, పెదవులమీదికి చిరునవ్వు తెచ్చుకొని, రవంత సిగ్గు ప్రకటిస్తూ, నిల్చుం దామె.

నా ఆత్మ ఇన్నాళ్ళనుంచీ ఒక వస్తువుకోసం వెదుకుతోన్నట్టు నా కప్పుడు తెలిసింది. ఆ వస్తువు ఈమె నని నా హృదయం ఘోషించింది. చాల రోజులకు కనిపించిన ఒక పాత స్నేహితుని చూచినప్పుడువలె హృదయంలో ఆనందం పొంగి, ఆమె సమీపాన నిల్చి ఏమేమో పలుకరించాలని ఉబలాట పడ్డాను. కాని అలా చేస్తే 'వీడికి మతి పోయినట్టుంది సుమా' అని మా అమ్మ అనుకుంటుందేమో ననీ, 'అపరిచిత లైన ఆడవాళ్ళ నింత చొరవగా పలకరిస్తా డేమిటి ఈ మూఢుడు' అని ఆ పిల్ల భావిస్తుందేమో ననీ, రెండుభయాలు నా ఉద్రేకాన్ని అణచిపెట్టి, పెదవుల్ని కదలనీయలేదు.

నాకు వయసు వచ్చాక ఎంతమంది స్త్రీలను రోజూ చూస్తూండటం లేదు! కాలేజిలో తోడి విద్యార్థినులు ఒక రిద్దరు తమ చూపుల్తో, విలాస—విభ్రమాలతో నా హృదయాన్ని కొనేయాలని ప్రయత్నించారు కాదూ! కాని ఇంత

వంటి పారవశ్యం నన్నెన్నడూ ముంచుకోలేదే — అనుకుంటూ 'ఇంటోకి వచ్చేశాను. ఆ అమ్మాయికూడా వెళ్ళివస్తానండీ' అని విపంచి మోగించి మా అమ్మను వీడ్కొన్నది.

కోటు విప్పుతూ, "ఆపి లైవరే అమ్మా" అని లోపలకు వస్తోన్న మా అమ్మను అడిగాను—ఆబాలిక సౌందర్యానికి నేను ముగ్ధుణ్ణి అయిన సంగతి ఆమె గ్రహించకుండా ఉండేలాగున మామూలు కంఠధ్వనిలోనే.

"చంపావతి కాదట్రా"

"ఏమిటి? చంపా! మన యెదరింటి వెంకట్రామయ్య గారి కూతురా? ఎంత గుర్తించటానికి వీలుగాకుండా మారి పోయిందే! ఎప్పుడొచ్చిం దిక్కడికి? వాళ్ళ తాతగారి ఊళ్ళో ఉంటోంది కాబోలుగా?"

"తాతగారూ, అమ్మమ్మా పదిరోజులు వ్యవధానంగా ఇద్దరూ దాటిపోయార్రా, రెండు నెల లౌతుంది. నువు చూ చేఉంటావు; పార్వతీ పరమేశ్వరుల్లాగా ఉండే వా ళ్ళా దంపతులు; ఆ రేళ్ళకింద ఈ అమ్మాయి పెండ్లికి ఇక్కడికి వచ్చారు కాదూ!"

"ఔ నమ్మా, జ్ఞాపకం ఉంది"

"వాళ్లు దాటిపోగానే తండ్రి వెళ్లి చంపను తీసుకొచ్చే శాడు. అప్పటినుంచి ఇక్కడే ఉంటోంది, తండ్రి కింత ఉడకేసి పెడుతూ. తల్లి లేనేలేదు కదా!

"వయసు రాగానే చాల అందం వచ్చింది, చంపకు; కాదులే అమ్మా!"

"కాని ఏమి లాభంరా నాయనా? ఎవరు చూచి సంతోషించరు? ఒకనాడా రెన్నాళ్లా - చచ్చేదాక ఆ మోడిబతుకు వెళ్ళబోయ వలసిందేకదా! ఇంకా చిన్నపిల్ల కావటంచేత చీర కట్టుకున్నా, తల దువ్వి జడ వేసుకున్నా, లోకంచూచీ, చూడనట్టు ఊరుకుంటోంది - నాలుగు రోజులుపోతే"- ఆనన్నావిన నువ్వే ఊహించుకో మన్నట్టు వాక్యం పూర్తి చేయకండానే మా అమ్మ వంటింటోకి వెళ్లి పోయింది. నేను కుర్చీలో కూలబడ్డా. మా అమ్మ అన్న ఆచివరమాటల్తో నాహృదయంలోకి విచార స్రవంతి చొచ్చుకువచ్చింది.

పెండ్లయి సంవత్సరం తిరక్కుండానే ఆ అమ్మాయిభర్త చనిపోయిన సంగతి నాకు జ్ఞాపకం వచ్చింది. ఒక్కరోజైనా భర్తతో ముచ్చటగా సంసారం చేసియెరగదు. ఇలాంటి ముగ్ధ బాలికలమీదనా లోకందాడి? ఇటువంటి అమ్మాయిల రక్తం తాగుతోన్నసంఘం రాక్షసి కాదూ? చంప ఏమి అపచారం చేసిందని లోకం ఆమెను హింసింప బూనుకుంటుంది?......

నామనస్సు కాలగర్భంలో ఆరుసంవత్సరాల వెనక్కు ఒక్కగంతేసింది. అప్పుడు నేను అయిదోఫారం ఈ ఊళ్ళోనే చదువుతున్నాను. పది పదకొండేళ్ళ వయస్సు ఉంటుం దప్పుడు చంపకు; అస్తమానమూ మాయింటోనే ఉంటూ ఉండేది. నేనామెతో తరచు గిల్లికజ్జాలు పెట్టుకుంటూండేవాణ్ణి. 'పల్లె

టూరిపిల్ల' అని ఉడికిస్తూండేవాణ్ణి. ఒకసారి చాటునుండి రబ్బరు పామును మీందికి విసరివేశాను; 'అమ్మో' అని ఆమె ఉలికి పడి లేచి పారిపోతూ—నేను పెద్దగా నవ్వగానే, నిజం తెలుసుకుని, తిరిగివచ్చి, ఆకోపంలో నామీందపడి రక్కి పెట్టింది. మరొక సారి బలవంతాన ఆపిల్లకు నా లాగూ, కోటూ తొడిగి, టోపీ పెట్టి, ఊరంతా చూపించి వచ్చాను. ఆ బాల్యక్రీడలన్నీ ఒక్కసారి నామనస్సులో గిర్రున తిరిగినై.

చంపను నా కిచ్చి పెండ్లిచేస్తానని వెంకటాద్రియ్యగారన్నప్పుడు— మా యిద్దరికీ నాలుగేళ్లు మాత్రమే అంతరం ఉందనీ, ఈడుకాదనీ, మా నాన్న అంగీకరించకపోవటమలా ఉండగా—వేళకు చక్కని తిండి, కట్టుకోటానికి మంచి బట్టలు, అప్పుడప్పుడు చిరుతిండ్లు, బడికి సెలవులు మొదలైన వీటిని మించి ఇంకో ఉత్కృష్టవస్తువును కోరటం చేతగాకండా ఉండిన నా అప్పటి పసిహృదయం చంపను అభిలషించ లేకపోయింది.

పెండ్లి కాకండా పిల్ల సమర్తాడిందంటే తన బ్రాహ్మణీకం మంట కలుస్తుందేమోనని భయపడ్డ వెంకటాద్రియ్యగారు చంపను ఎవరికో ఇచ్చేసి వివాహం చేశాడు. తరువాత విధి తన ప్రభుత్వాన్ని చూపెట్టేసింది...

ఇలా వెనుకటిసంగతులు నెమరు వేసుకుంటూ ఉండగా, "అన్నం వడ్డించాను రారా" అని మా అమ్మకేక వినిపించింది.

౨

మర్నాడు ఉదయం స్నానమైనతర్వాత సూటు, బూటు వేసుకుని కాఫీ హోటలుకు బయలుదేరాను. వాకిట్లోకి వచ్చే సరికి, వాళ్ళగుమ్మందగ్గిర ముఖంకడుక్కుంటూ వెంకట్రామయ్య గారు కనిపించారు. నేనే పలుకరించాను: "ఏమండి, బాగున్నారా?" అని. "ఓహో, కృష్ణుడా!, మొన్ననే వచ్చావుట గదోయ్! రాత్రి మా అమ్మాయి చెప్పింది. ఈ యేటితో నీ చదువు పూర్తి ఔతుంది కాబోలేం? వేసంగిలో రాగానే పెండ్లి చేసుకుంటావన్నమాటేనా?" అన్నా రాయన మందహాసం చేస్తూ.

అందుకు జవాబేమీ దొరక్క నేను ఆలోచిస్తోంటే— "చదువు పూర్తి అయితేసరా? ఉద్యోగం దొరికితేనేగాని పెండ్లికొడుకవడేమో!" అని తండ్రికి వెనకాల తలుపు పక్కన నిల్చుని చంప నవ్వుతూ అంది. వెంకట్రామయ్యగారు మళ్ళీ అన్నారు: "మా పెత్తండ్రి మనుమరాలొకతె ఉందోయ్. సెలవులేగా, రేపో, ఎల్లుండో వెళ్లి చూచివద్దాం ఏమంటావ్? నీకు నచ్చితే వివాహం స్థిరపరచుకోవచ్చు; ఏమంటావు?"

దీనికికూడా నా కేమీ సమాధానం తోచలేదు. చంపా వతే మళ్ళీ ఒక బాణం విడిచింది. "ఈ దొరగారికి పల్లెటూరి పిల్లలు నచ్చరేమో నాన్నా! 'ఆంగ్లో యిండియన్ లేడీ' కావాలేమో మరి! ఔనా కిష్టూ!"

"చూడండి వెంకట్రామయ్యగారూ! చంప చిన్నప్పటు మల్లనే ఇంకా నన్నెగతాళిచేయటం, ఉడికించేమాట లనటం మానేయలేదు. ఇదిగో చంపా! సూటు వేసుకున్నా నని ఎగతాళిగా ఉందికామాలు నీకు? చిన్నప్పుడు నీకొక షరాయి, కోటు తొడిగాను జ్ఞాపకం ఉందా? ఉండు, ఎప్పుడో ఆంగ్లో యిండియన్ లేడీ వేషంకూడా నీకే వేసి ఊరేగిస్తా" అన్నాను.

నా యీ మాటలతో వెంకట్రామయ్యగారికీ మా బాల్యదినాలు జ్ఞాపకం వచ్చి ఉండచ్చు; ఒకవిషాదచ్ఛాయ ఆయన ముఖాన్ని ఆవరించినట్టు నాకు పొడగట్టింది. ఒకరకంగా మందహాసం చేసి, "లోపలికి వెళ్ళి కూచోవోయ్, నిల్చున్నా వేం?" అన్నాడు.

"కాఫీ తాగివచ్చి తీరికగా కూచుంటా లెండి" అని చెప్పి, ఒకసారి చంపవేసి ఒక్కనవ్వుచూపువిసరి వెళ్ళిపోయాను."

'జానా, కిష్టూ!'...ఎంత మధురంగా సంబోధించింది చంప! ఆ పిల్పినప్పుడు రసప్రపంచాలు పులకరించిన్నె. 'కిష్టూ'— ఆ మధురకంఠం ఇప్పటికీ నాగుండెలో వినిపిస్తూనే ఉంది.

కాఫీ తాగివచ్చి వెంకట్రామయ్యగారి యింటో ఎంతసేపు కూచున్నా చంప కనిపించక పోవటంచేత చాలా ఆందోళన పడ్డాను. ఆయన తన గొడవంతా ఏమిటేమిటో చెబుతూ నాకు విసుగు పుట్టిస్తున్నాడు. ఆయన ధోరణి అంతా ఒక విషయంమీద ఆధారపడి ఉండకుండా సర్వతోముఖంగా ఉంది. (పూర్వకాలపు వాళ్ళతో ఇదే తిప్పలు.) చివర కేమో

సందర్భంలో చంపకు కొన్నాళ్ళనించీ జబ్బుగా ఉంటోందనీ, మందు కోసం ఇంతకుముందే డాక్టరుగారింటికి వెళ్ళిందనీ చెప్పాడు.

“చంపకు జబ్బా! ఏం జబ్బు?” ఎంతో ఆదుర్దాగా నా నోటినించి ఊడిపడ్డ దా ప్రశ్న.

వెంకట్రామయ్యగారు తన వొంకరటింకర భాషలో అంతా బోధపరచాడు: పది పన్నెండు రోజులక్రితం చంపకు జ్వరం వచ్చిందట. అప్పుడు డాక్టర్ని పిలుచుకువచ్చి చూపించగా, ఆయన పరీక్షచేసి, ఆమె శరీరంలో క్షయవ్యాధి అంకురాలు ఉన్నాయనీ, ఉపేక్షిస్తే అవి కాలక్రమాన విజృంభించి రోగం మన చెయిమించిపోతుందనీ చెప్పాట్ట. అంచేత ఆ వచ్చిన జ్వరం నయమైన తర్వాతకూడా చంప రోజూ వెళ్ళి మందు తెచ్చుకుంటోందిట.

నాగుండె నిలువునా నీరయింది. క్షయ మహా చెడ్డవ్యాధి. ప్రాణాలు తీసేవరకూ మనిషిని విడిచిపెట్టదది. అటువంటి విషవాయువుల కీ లేత చంపకం ఆహుతి కావలసిందేనా?...

ఒకవేళ లేనిజబ్బు ఉన్నదని చెప్పి భయపెట్టి డబ్బు లాగటానికి డాక్టరుగారు వేసిన యెత్తా? నెలకు రెండుమూడు వందల రూపాయలు ఆదాయం వచ్చే ప్రాక్టీసు కలవాడు ఆయన అంత నీచప్రవర్తన కొడిగడతాడా? అదీగాక వెంకట్రామయ్యగారి దగ్గిర ఏ ముందని ఆయన ఆశ పడేందుకు? వ్యాధి ఉన్న సంగతి నిజమేనేమో? కాని చంపావతి కన్నుల్లోని కాంతి, చెక్కులనునుపు, యౌవనము, సన్నద్ధమైయున్న అవయవాల

బింకము — అన్నీ సంపూర్ణ ఆరోగ్యాన్ని ప్రదర్శిస్తున్నై. అయినా, ఏమో! డాక్టర్ని కాముకదా!

ఇలాగ—పాపం, చంపకు ఇంత చిన్నవయస్సులో వెధవ రోగం పట్టుకుందేమా అని విచారిస్తోంటే వెంకట్రామయ్యగారు ఏమి టేమిటో చెబుతూనే ఉన్నాడు. నేను విన్నా, వినక పోయినా 'ఊ' మాత్రమంటున్నా.

ఇంతలో మందుసీసా చేత పట్టుకుని చంప వచ్చింది.

"ఏ మన్నాడమ్మా డాక్టరు" అని తండ్రి అడిగాడు.

"రేపు ఉదయం ఒక 'ఆపరేషన్ కేసు' ఉందిట. అందు కని రేపు మందుకు సాయంత్రం నాలుగు గంట లప్పుడు రమ్మ న్నారు. రేపు ఉదయానికి కూడా మందు ఇవాళే కలిపి ఇచ్చారు" అని చంప చెప్పింది.

చంప వచ్చాక ఒక అరగంటసేపు అక్కడే మాట్లాడుతూ కూచుని చివర కింటికి వచ్చేశాను.

## 3

ఆనాడే మధ్యాహ్నం భోజనంచేసి కుర్చీలో పడుకుని వీరేశలింగంగారి వ్యాసావళి చదువుతున్నా. కొంతసేపటికి పక్క యింటో ఉంటోన్న చయన్లుగారి విధవవదినెగారు వచ్చి మా అమ్మతో బాతాఖానీ వేసుకు కూచుందని తెలుసుకున్నాను.

సూరమ్మగారి కంఠధ్వని ఆవూళ్ళో పిల్లలదగ్గరనించీ గుర్తు పట్టగలరు. అస్తమానమూ ఎవరితోనో ఏదో ఒకటి

నాగుతూ ఉండమని భగవంతుడామెను సృష్టించినట్లు తోస్తుంది. మంచినీళ్ళబావి దగ్గరో, వీథిలోనో, చెరువునడ్డనో - ఎక్కడో ఒక చోట — నిద్రపోయే ఆ నాలుగు ఘడియలూ తప్ప — ఆమె ఏదో ఒక విషయాన్ని గురించి ఉపన్యసిస్తూ ఉండవలసిందే; లేకపోతే ఎవరితోనో పోట్లాడుతూ ఉండవలసిందే. ఏ విషయమైనా మొదట ఆమెకు తెలిసి, తరువాత అవ్వాళ్ళే అందరికీ తెలుస్తుంది. అంచేత బడిపిల్లలు ఆమెను చూచినప్పుడు 'ఆంధ్ర పత్రిక' అని పిల్చి పారిపోతారు.

సూరమ్మగారు — ఇప్పటికాలపు ఆడవాళ్లు సినీమా షోకులకోసం పాకులాడ్డం — భార్యలకు లొంగి ఉండే ఉద్యోగస్థుల అధమస్థితి — ఈ మొదలైన కొన్ని సాంఘికపరిస్థితుల్ని సింహావలోకనం చేసి, నేడు బ్రాహ్మణీకం పూర్తిగా అడుగంటి పోతోందని పలవిస్తూ, మా అమ్మతో అంటోంది! "చూడండి, అక్కగారూ! మీయెదరింటి వెంకట్రామయ్యగారు అంత నిష్ఠపరుడా మళ్ళీను; జుట్టున్న ఆ వైధవకూతురు వండితే తింటారేమిటండీ? ఆ పిల్లమాత్రం అదేమి చోద్యమండీ మరీను; చీరలు కడుతుంది, జడ వేసుకుంటుంది; పెద్దవాడు ఆ తండ్రి అయినా చెప్పకూడదూ! మళ్ళీ పెళ్ళి చేద్దా మనుకుంటున్నా డేమో! అలాగా షోకులు చేసుకోనిస్తూంటే ముందుముందు చెప్పినమాట వింటారుటండీ! ఎప్పుడో గుడిసెమీద దెబ్బతీసి లేచిపోరూ?..."

ఆ మాటలు వింటోంటే చేతిలోని వీరేశలింగంగారి 'వ్యాసావళి' తీసి ఆమెబోడితలమీదికి విసరివేద్దా మనిపించింది. ఈ మహాపతివ్రత ఇంటో చేరినతర్వాతనే చయన్లుగారికి 'వ్యభి

చారి' అని బిరుదు వచ్చింది. ఈవిడపోషణలోనే పెరిగిన మేనకోడ లొకతె సంవత్సరంకింద తురకవాడితో లేచిపోయింది. ఇప్పుడీమె ధర్మపన్నాలు చెబుతుంది. ఇతరుల తప్పులు వెదకుతుంది.

లోపలి ఉద్రేకాన్ని అణచుకోలేక అన్నాను: "మీరలాగ అనటం తప్పండీ సూరమ్మగారూ!"

"చిన్నవాడివి నీ కేమి తెలుస్తుం దబ్బాయీ! అదీగాక ఇంగ్లీషు చదువులు వచ్చాక పచ్చికిరస్తానప్రగున్నారు మీ కుర్రవాళ్ళంతా. మనహిందూమతం, మన ధర్మాలూ, మన శాస్త్రాలూ మీ కేం తెలుసు? మాచయ్యబావగారు రోజూ గుళ్ళో భాష్యం చెబుతున్నారు; ఒకనాడు వచ్చి విను ఎలాఉంటుందో!"

"అయితే బావగారిదగ్గర మన్మథ శాస్త్రాభ్యాసా, తురక వాడితో లేచిపోవటం - ఇలాంటివన్నీ మనధర్మాలు, మతం ఒప్పుకుంటాయిగాని జుట్టున్న విధవరాలు వండితే తినటం తప్పొచ్చిందే ?"- ఉద్రేకంగా అనేశాను.

"చూడండీ, అక్కగారూ! ఎంతెంతమాట లంటున్నాడో! ఏదో పొద్దుపోక కాస్సేపు కూచుని పోదామని మీయింటికి వచ్చినందుకు చిన్నా పెద్దా లేకుండా అలా గంటాడా ?"

"ఊరుకోరా నాయనా! నీ కెందుకు?" అని మా అమ్మ నన్ను మాట్లాడకుండా చేయటానికి వృథా ప్రయత్నించింది.

అన్నాను: "మిమ్మల్ని నే నేమీ తిట్టటం లేదండి సూరమ్మగారు! లోకంసంగతి చెబుతున్నాను. మీకే చంప

లాంటి విధవకూతు రుంటుందనుకోండి; మీరు మీరే ఆ అమ్మాయితో పైపసుపులు కట్టుకోమనీ, జుట్టు గొరిగించేసుకోమనీ, చెప్పటానికి మీ మాతృహృదయం వొప్పుకుంటుందీ? ఆలోచించండి, సంఘం విధించే క్రూరచట్టాలే పరమధర్మాలని నమ్మి హృదయాల్ని పాషాణాలుగా చేసుకున్న వాళ్ళలాగ మాట్లాడుతారేం మీరుకూడా? ఆడవాళ్ళు హృదయం కలవాళ్ళుకదా!”

“ఔ నబ్బాయి! మేం రాళ్ళం, రప్పలం, రాక్షసులం. వెళుతున్నా లెండి అక్కగారూ! బాగా దగిరుండి మీవాడిచేత అన్నిమాటలూ అనిపించారు. మిమ్మల్ని రంకుముండలకింద కట్టేశాడు. ఔను, మీకళ్ళకు మే మలాగే కనిపిస్తాం.” అంటూ ఆమె లేచి వీధిలోకి వెళ్ళాక కంఠస్వరం హెచ్చించి, ఏమేమో అసందర్భంగా వాగి, నామీద లేనిపోని అబద్ధాలన్నీ కల్పించి అందరూ వినేలాగు పెద్దగా — నే నామెను తిట్టాననీ, కొట్ట వచ్చాననీ, వీధంతా చాటించి, చివరకు ఇంటోకి వెళ్ళిపోయింది.

“ఆమెతో ఎందుకురా వాదం వేసుకున్నావ్? ఈవీధిలో ఎవరూ ఆమెమాట కెదురు చెప్పరు. ‘గయ్యాళిమ్మా దండ మమ్మా’ అని ఊరుకుంటారు. అటువంటప్పు డామెతో నీకెందుకు చెప్పు” అని మా అమ్మ నన్ను కాస్త కూకలేసింది.

౪

మర్నాడు ఉదయంకూడా కాఫీ తాగిన తర్వాత చాల సేపు వెంకట్రామయ్యగారి యింట్లోనే కూచున్నా. మాటల

సందర్భాల్లో చంప 'కిష్టూ' అని పిల్చినప్పుడల్లా నా నరనరాలు పులకరించి, ఆనందరసధునీ తరంగాలమీద తేలిపోయేవాణ్ణి. 'రతి ముభయప్రార్థనా కురుతే' కాబట్టి 'చంపా' అని నేను పిల్చినప్పుడు ఆమెకూడా అట్టి ఆనందమే పొందుతూన్నట్టు తెలుసుకోవాలని ఉబలాటపడేవాణ్ణి.

ఆ మధ్యాహ్నమే భోజనం చేసి మాయింటో గదిలో పడుకుని నిద్రపోయాను. నామనస్సు ఎక్కడికో ఒక స్వర్గీయారామంలోకి పరుగెత్తింది. అక్కడి మందపవనాలు నాకు నూతనోత్సాహం కలిగించినై. సెలయేళ్ళరొద శ్రుతిగా, శకుంతగానము ఎంతో ఇంపుగా ఉంది. ప్రకృతిలోని మాధుర్య మంతా నా యాత్మలోకి తోవ చేసుకుంటోంది. పూవుల వలపు తావుల్ని జీర్ణించుకుంటున్నా; మధురఫలాల రసంతో పెదవులు తడుపుకుంటున్నా. నిత్యము వసంతుడు తాండవిస్తూంటే ఈ ఉద్యానవనం నాదేనా? ఈ స్వర్గసౌధప్రాజును నేనే కదూ!...ఆ సంపంగిలత మాటునుండి 'కిష్టూ' అని పరిచితకంఠస్వని వినిపించింది. చూచాను; ఆలత వెనుక మరొక లతలాగ ఉంది, ముసిముసి నవ్వులు నవ్వుతూ, — చంప తొంగి తొంగి చూస్తోంది. ఆ మనోహరదృశ్యం నా హృదయానికి చక్కిలిగింత పెట్టింది. పట్టుకుందామని అటుకేసి పరుగు పెట్టాను! ఆమె చుంగున కురంగ శాబకమువలె మరొకవేపు పరుగెత్తింది. ఆమె ముందు నేను వెనుక వనమంతా పరుగులు పెట్టాం. చివర కొక పొదరింటో దాగున్న ఆమెను పొదివి పట్టుకున్నా. అప్పుడు మా కిలకిల నవ్వులతో గాలితరంగాలు ఆడుకున్నై...

నేను నవ్వుతూనే నిద్రనుండి లేచా. ఎంత చక్కనికల! మెలకువ కలిగిన తర్వాత ఎంతో హాయి అనిపించింది. కొత్త బలం, కొత్త ఉత్సాహం చేకూరినట్లయింది. చేతిగడియారంలో 'టైము' చూస్తే నాలుగు దాటింది. చంప ఇవాళ మందు కోసం డాక్టరింటికి వెళ్లే వేళ ఇదేనని జ్ఞాపకం వచ్చింది.

హోటల్లో ఇంత కాఫీ తాగి, అటు చెరువుకేసి షికారు వెళదామనుకుని, కోటు తొడుక్కుని వీధిలోకి రాగానే వాళ్ల యింటోనించి వెంకట్రామయ్యగారు కేకవేసి పిల్చి ఇలా గన్నాడు—"ఇదిగో, కృష్ణుడూ! ఇంతకుముందే చంప డాక్టరుగారింటికి వెళ్లిందోయ్, అటే వెళుతున్నావు కాబోలు, కాస్త డాక్టరుగారితో మాట్లాడి అమ్మాయివ్యాధినిగురించి బాగా వివరాలు తెలుసుకుని, ఎన్నాళ్లు మందు తినాలో ఏమిటో, దబ్బున నయమౌతుందో కాదో—అన్నీ అడిగిరమ్మా నాయనా! పూర్వకాలపువాణ్ణి నాకంటే ఇంగ్లీషు చదువుకున్న నీవంటివాళ్లు వెళితే బాగా సంగతి సందర్భాలన్నీ చెబుతాడు. కనుక్కొస్తావు కదూ!"

"అలాగేలెండి" అని బయలుదేరి, దారిలో కాఫీతాగి వెళ్ళేటప్పటికి డాక్టరుగారింటి వీధితలుపు తెరవలేదింకా. నాకంటే ముందు బయలుదేరిన చంప ఇంకా రాకుండా ఉందా? వచ్చి ఈపాటికి మందుతీసుకు వెళ్లిపోయివుండచ్చు ననుకున్నాను. అయినా వెంకట్రామయ్యగారి కోరికప్రకారం డాక్టరుగార్ని కలిసికొని మాట్లాడుదామనే ఉద్దేశంతో ఇంటిముందు అరుగెక్కి కిటికీలోంచి లోపలకు చూచాను.

ముందు డాక్టరుగారు కూచునే కుర్చీ, టేబిలు, మందుల బీరువాలు, — ఇవన్నీ ఉన్న హాలు. దానివెనుక ఇంత విశాలమైనదే ఇంకో హాలు ఉన్నట్లు తెలుస్తున్నది. మధ్యద్వారం మూసేఉంది; కాని ఆ పక్కన తెరచివున్న కిటికీలోనించి — ఎవరో ఒకయువతి (ముఖం కనిపించలేదు) వెనక్కు అడుగులు వేస్తూ వెళ్లినట్లు చూచాను. మరుక్షణమే ఒక మగవాడామె కెదురుగా నడచివెళ్లాడు. స్త్రీకంఠం అస్పష్టంగా, దీనంగా వినిపించింది. నా ఊహాప్రపంచంలో ఆ అమానుష—అత్యాచారం మెరుపువలె మెరిసింది. నా శరీరంనించి విస్ఫులింగాలు చిమ్మాయి.

"డాక్టర్! డాక్టర్!" అని ఒళ్ళు తెలియని ఉద్రేకంలో అరిచాను.

నా బంధువుల్లో ఎవరన్నా చావుబతుకులమీద ఉంటే డాక్టరు సహాయంకోసం అంత ఆదుర్దాపడుతున్నానని భావించి దారిన పోతూన్న నలుగురు పెద్దమనుష్యులు నా కేసి కరుణాత్మకంగా చూచి వెళ్ళిపోతున్నారు.

నా కంఠధ్వని వినగానే లోపల ఆమె 'కృష్ణా' 'కృష్ణా' అని పిచ్చిగా కేక వేసి, వెక్కి వెక్కి ఏడుపు ప్రారంభించింది____ ఆపదలో ఉన్నవాడు మన మాదరింపబోతే బావురుమన్నట్లు. నే ననుకున్నట్లామె చంపే.

డాక్టరు కిటికీవద్దకు వచ్చి, "ఫూల్! ఎవరు నువ్వు? వెర్రి కేకలు వేస్తున్నావ్ బైట నిల్చుని! వెళ్ళిక్కడినించి" అని జబర్దస్తీ చేశాడు.

"నువ్వు వెంటనే తలుపు తీస్తావా లేదా?" ఆకాశం చిల్లులు పడేట్టు ఉరిమాను. దారిన పోతోన్న పెద్దమనుష్యులు ఆగారు.

"ఎవరో పిచ్చివాడు లాగున్నావు. అరుగు దిగు మొదట. పోలీసుస్టేషనుకు ఫోను చేస్తున్నాను జాగ్రత!" అని లోపలనుంచి డాక్టరు వెధవబెదిరింపు.

వాడు తలుపు తీసేట్టు లేడు. నేను ఓపిక పట్టలేకుండా ఉన్నాను. "ఓరి గాడిదా! నీకు పోలీసులతో కూడా దోస్తీ ఉందే?" అంటూ వీధితలుపు ఒక్కతన్నుతో ముక్కలుచేశాను. నాబలం కాదు, అప్పటి నా ఆవేశం అంతపని చేయగలిగింది.

ఒక్కగంతులో డాక్టర్ని సమీపించా. వీధిన పోతోన్న జనమంతా నా వెనుకనే లోపలకు వచ్చారు. నా హంగామా అంతా చూచి చంప ఏడుపు మానేసి బిత్తరబోయి చూస్తోంది.

నేను ఒకచేత్తో డాక్టరుగారి చొక్కాకాలరు పట్టుకుని, రెండో చేయి విసురుగా ఎత్తాను. కాని వచ్చిన పెద్దమనుష్యులూ, 'అంత గందరగోళం చెయ్యకుసుమా' అని ఆదేశిస్తోన్న చంపనేత్రాలూ, నన్ను అడ్డపెట్టకపోయినట్టయితే ఆ దెబ్బతో వాడిచెంప వాచిపోయేది.

వచ్చినవాళ్ళంతా డాక్టర్ని తలా ఒకమాట అన్నారు. వయసు మళ్ళినవారు ఉపదేశపూర్వకంగా చీవాట్లు పెట్టారు. నడికారువాళ్ళు పేముబెత్తాలతో మోదినట్టుగానే మాట్లాడారు. వైద్యుడు వంచినతల ఎత్తాడుకాడు. ఇంకొక అభిమానం కల

నాకైతే అప్పటి కప్పుడా జరిగిన అవమానానికి ప్రాణాలు విడిచిపెట్టేవాడే.

నేనుకూడా "ఇదిగో డాక్టర్! ఇన్నాళ్ళనించీ నువ్వేమో మంచివాడి వనుకుంటున్నాం. జాగ్రత! లేని జబ్బులు వున్నాయని చెబుతూ ప్రజల్ని మోసగించి డబ్బు లాగటానికీ, ఆడవాళ్లను చెరచటానికీ, నీ వైద్యవృత్తి ఉపయోగించుకోవటం సాగించావంటే తన్నులు తిని పోగలవు" అని తీక్షణంగా పలికి, చంపను తీసుకుని వెళ్ళిపో నుద్యుక్తురాలయ్యాను.

ఇంతలో అక్కడున్న ఒక హైస్కూలు కుర్రాడు ముందుకు వచ్చి "ఈ డాక్టరుగారికి పాపమేదో జబ్బు ఉందండీ! కాస్త అందంగా ఉన్న ఆడవాళ్లను చూస్తే వెర్రెత్తిపోతుం దీయనకు. మొన్న నొకావిడ, ముల్లు గుచ్చుకుని కాలు వాచి మందు కోసం వస్తే, గుండె పరీక్ష చెయ్యాలి, పమిట తీయమన్నాడు. 'కాల్లో ముల్లుగుచ్చుకుం దంటోంటే గుండె పరీక్షేమిటి నీ పిండా కూడు, ఏడిచినట్టే ఉంది నీ వైద్యం' అని ఆ వచ్చినావిడ కొంచెం గడుసుది కావటంచేత లాగి చెంపకాయవేసి చరచరా వీధిలోకి వచ్చేసింది. దెబ్బతిన్న చెంప తడుముకుంటూ వెనక్కు వచ్చేస్తూం- కిటికీ దగ్గరుండి అంతా చూస్తోన్న నాకేసి ఆకోపంలో పిడికిలిపట్టి పరుగెత్తాడు. ఆయనకు నేను చిక్కలేదు లెండి" అని అందర్నీ నవ్వించాడు. డాక్టరుముఖం మరీ నల్లబడ్డది.

నేను చంపను తీసుకుని ఇంటికి వచ్చేస్తున్నాను. సగం దూరం వచ్చాక ఆమె అన్నది: కిష్టూ! నీవు నా మూలాన

కదా నిన్న సూరమ్మగారితో దెబ్బలాడావు; ఇవాళ డాక్టరుతో—"

"సూరమ్మ, డాక్టర్లతోనే కాదు చంపా! నిన్నాడిపోసుకుంటూ, నిన్ను హింసించాలని ప్రయత్నించేట్లయితే యీ యావత్తు సంఘంతో కూడా దెబ్బలాడతాను."

చంప వికసిత నేత్రాలతో నాకేసి చూచింది. "నిన్ను చూస్తోంటే నాకు సోదరుడు లేని కొరత కనిపించటం లేదు కిష్టూ" అంది.

ఆ మాటలతో — అదివర కామెపట్ల నాకున్న ప్రేమలో మాలిన్యమువలె ఉండి, ఒక బాధ (మధురమైనదే అయినా) కలిగిస్తోన్న అవ్యక్త వాంఛ అంతర్థానమయింది. ఆమె నాకు కావాలి అనే భావం పోయి, ఆమె సుఖంకోసం నా జీవితమంతా వినియోగించాలనే వెర్రిఆవేశం అనుభవించాను.

సెలవులు ముగిసి; నేను తిరిగి పట్నం వెళుతోంటే చంప తన చనిపోయిన భర్త ఛాయాచిత్రం ఇచ్చి దాన్ని 'ఎన్లార్జ్' చేయించి పంపించమని చెప్పింది.



# నేనూ వస్తున్నా

"మీరు పలుసార్లడిగి లాభం లేదన్నాను. ఇప్పుడు శ్యామలను పంపించేందుకు వీల్లేదు." అని నిక్కచ్చిగా చెప్పేసి చేతిగడియారంలో నాలుగవటం తెలుసుకుని, టెన్నిసు బ్యాటు పుచ్చుకుని, చౌదరి క్లబ్బుకు వెళ్ళిపోయాడు.

ఈమాటలతో నాయుడుగారికి అల్లుడిమీద చాలా కోపం వచ్చింది. దుఃఖంకూడా పొర్లివచ్చింది, ఇప్పుడు పంపేందుకు వీల్లేదు! ఎప్పుడు వీలుంటుంది మరి? శ్యామల కాపురానికి వచ్చి రెండేళ్ళయింది. ఎన్ని పండగలు, ఎన్ని పబ్బాలు వృథా పోయినై? అచ్చటా, ముచ్చటా లేదు; ఎప్పుడు పంపమని అడిగినా వీలు కాదంటాడు.

పోనీ, వాళ్ళిద్దరూ కలాసాగా ఉంటే అంతే చాలనుకుని సమాధాన పడుతూండేవాడు నాయుడు; కాని నెలరోజుల నించీ ఆయనభార్య లేవటంలేదు. దగ్గు, జ్వరం—రోజురోజుకూ ఆమె క్షీణించిపోతోంది. ఎన్నిమందు లిప్పించినా లాభం లేకుండా ఉంది. ఒక్కసారి కూతుర్ని చూడాలని ఆమె బెంగపెట్టుకుంది. అందుకోసం నాయుడుగారు వచ్చి అల్లుణ్ణి దీనంగా అడిగాడు. లాభం లేకపోయింది.

నిర్మొగమాటంగా ఆ నాలుగు మాటలు చెప్పేసి చౌదరి వెళ్ళిపోగానే ఆయనగారు లేచి, గొడుగు పుచ్చుకుని— అంతసేపునించీ మామా అల్లుళ్ళ సంభాషణ వింటూ గది గుమ్మంవద్ద నిల్చునివున్న శ్యామలవైపు పితృవాత్సల్య గర్భిత

మైన ఏక్షణం బరసి—మరుక్షణమే గుండెపగులజీల్చుకుని వెలికి వస్తోన్న దుఃఖంచేత నేత్రాలు చెమ్మగిలగా—అది చూచి కూతురు అధైర్యపడుతుందేమోనని ముఖం తిప్పుకుని—“వెళ్ళొస్తా నమ్మా” అని కంఠగాద్గదికం ప్రకటంకాకుండా ప్రయత్నపూర్వకంగా అన్నాడు.

శాస్త్రిగారి హృదయవేదన శ్యామల గ్రహించింది. కాని తా నేమి చేయగలదు? అన్నది మాటవరుసగా: “మీరు మనస్సు కష్టపెట్టుకోకండి నాన్నగారూ! నేను నిమ్మదిగా ఆయనతో చెప్పి ఒప్పించి, నాలుగైదు రోజుల్లో వస్తాలెండి. ఇంటికి వెళ్ళగానే అమ్మవాళ్ళెలా ఉన్నదీ తప్పకుండా ఉత్తరం రాయండేం?”

“నాకు మాత్రం అతను నిన్ను పంపిస్తాడన్న నమ్మకం చిక్కటం లేదు తల్లీ! చౌదరిహృదయంలో ఇంతకాఠిన్యం దాగి వుందని పెండ్లికిముందు నాకు తెలియలేదు. బంధుకోటిలో వాడుకదా, నిన్ను సుఖపెడతాడు, మనమ్మల్ని సంతోషపెడ తాడు అనుకున్నాం. బాగా చదువుకున్నవాడు మళ్ళీను. కాని—సరే వెళ్ళొస్తా నమ్మా!”

“అమ్మ కెలా ఉన్నదీ తరుచు ఉత్తరాలు రాస్తూండండి”

“అలాగే”

నాయుడు స్టేషనుకేసి నడచి వెళుతున్నా డన్నమాటే గాని, ఆయనమనస్సు మనస్సులో లేదు. ఇంటికి వెళ్ళగానే “వచ్చిందా శ్యామ?” అని భార్య అంతజబ్బులో ఉండి ఆదుర్దాగా అడుగుతుంది; తా నేమి చెప్పాలి? రాలే దని తెలుసుకుని ఆమెహృదయం ఎంతకుంగిపోతుందో! అబ్బ!

పొంగివచ్చిన కన్నీళ్ళవల్ల దారి కనబడక కాస్సేపు నిల్చున్నచోట ఆగిపోవలసి వచ్చింది. అప్పుడాయన కొక ఆలోచన తట్టింది. వెనక్కు తిరిగివెళ్ళి, శ్యామలనుకూడా తీసుకువస్తే ఏం? చౌదరి ఇంటో లేడామెను. ఔను. బాగుంది ఆలోచన. తరువాత తెలిస్తేముట్టుకు చౌదరి ఏమి చేస్తాడేమిటి?

కాని అలా నీవు చేయటం శ్యామల భావి జీవితానికి పెద్ద ఆఘాత మౌతుందేమో సుమా అని తనలో ఎవరో తర్కించి అడిగినట్టయింది. నాయుడు నిరాశతో అడుగులు ముందుకు సాగించి స్టేషను చేరుకున్నాడు.

* * * *

తండ్రిగారు అంతగా వ్యాకులపడ్డది ఎన్నడూలేదు; ఆయన ధైర్యము అంతగా ఎన్నడూ చెదరలేదు; శ్యామలకు తెలుసు. ఇవాళ ఆయన కంటనీరుకూడా పెట్టుకున్నాడు. అంటే తల్లికి చాల సుస్తీగా ఉండిఉండాలి.

తల్లిక్కి తానంటే పంచప్రాణాలు. పుట్టింట ఉన్నప్పుడు పండుగ, పర్వం వస్తే తన కేమి పిండివంటలు కావాలో అడిగిఅవే చేసేది. ఇవతలచెంబు తీసి అవతల పెట్టనిచ్చేదికాదు. రాజకుమార్తెనులాగ పెంచింది. తాను భర్తృగృహానికి బయలుదేరి వచ్చేరోజున ఎంత దుఃఖపడ్డది! ఎన్నినీతులు ఉపదేశించింది! ఏడువకూడదు, అపశకునమంటూ నాయుడుగా రెంత మందలించినా, కన్నీళ్లు వెల్లువలుగా ప్రవహించిన వామె నేత్రాలనుండి. అట్టి ప్రేమమయి తల్లి ఇవాళ జబ్బుగా వుండి తన్ను చూడాలని

కలవరిస్తోంటే వెళ్ళలేక పోతోంది. ఆమె వాత్సల్య పూర్ణ హృదయం ఎంత విలవిల కొట్టుకుంటున్నదో కదా!

తన్ను పుట్టింటికి పంపకండా మామగారిమీద పగ తీర్చుకోవాలని భర్త ప్రయత్నించటం మామెకు సమంజసంగా కనిపించలేదు. అయినా ఆరువేల రూపాయలు కట్నం ఇచ్చి, అన్ని లాంఛనాలూ జరిపి, సాలంకృత కన్యాదానం చేసిన మామగారిపట్ల — కేవలం పెండ్లిలో అలకనా డిస్తానన్న మోటారు సైకిలు ఇంతవరకూ ఇవ్వలేకపోయినంత మాత్రాన — అంత విరోధం పూనటం ఆయనగారికే తగదు. తాము కాఫీ తాగుతోన్న వెండికప్పులు, భోజనం చేస్తోన్న వెండియరటాకు, కుర్చీలు, బల్లలు, బీరువాలు, పడుకునే పందిరిమంచం — అన్నీ ఆయన ఇచ్చినవే. ఈ సంగతే ఒకసారి తాను భర్తకు జ్ఞాపకంచేసి, మామగారిపట్ల కోపం పోగొట్టాలని ప్రయత్నం చేసింది. అందుకాయన చెప్పిన జవాబిది: "నువ్వెప్పుడూ మీనాన్న అది యిచ్చా, డిది యిచ్చాడని ఉగ్గడిస్తుంటావ్. మోటారు సైకిలు విషయంలో ఆయన ఔదార్యం బాగానే తెలుస్తున్నది."

"పోనీండి, ఇవ్వలేదనుకోండి, మీ కంత కోపం ఎందుకు? ఆయనకష్టాలుకూడా మనం విచారించవలసిందే కదా! అయినా, ఒక రివ్వాలి, మనం తీసుకోవా లన్నమాటెందుకు? మీచదువుకు తగిన పెద్దవుద్యోగమే దొరికింది; నాలుగైదు నెలల్లో మీరే కొనుక్కోవచ్చును."

"నాన్న డబ్బు ఖర్చు కాకండా ఉంటే సరి; నీ కదీ కావాలి. భలే కూతుర్ని కన్నాడుపో నాయుడుగారు. ఒక్కడిప్పుడు ఇస్తా నన్నది లాగి తెచ్చుకునే తెలివితేటలు సున్నా."

ఈవిధంగా మాట్లాడే భర్తతో ఎక్కువగా తర్కించి ఆయనకు కోపం తెప్పించటం కంటే వేరే ప్రయోజనం ఉండదని కాలక్రమాన శ్యామల తెలుసుకుంది. పంపడన్న నిరాశచేత పుట్టింటికి వెళ్ళాలన్న కోరిక అణచివేయటానికి ప్రయత్నించింది. కాని తల్లికి సుస్తీగా ఉన్నదని తెలిసినతర్వాతమాత్రం ఎలాగైనా ఒకసారి వెళ్ళి చూడాలని హృదయం మహా బెదర చేయసాగింది.

నాన్నగారు నిరాశతో వెళ్ళిపోయినతర్వాత ఆసాయంత్ర మంతా ఆమెయాలోచనలు—'ఎలాగ ప్రసంగం తెచ్చి భర్తను ప్రసన్నుణ్ణిచేసుకుని, పుట్టింటికి వెళ్ళేందుకు అనుమతి పొందాలి?' అని. కాని ఆ విషయం ఎత్తితే ఆయన కేమి కోపం వస్తుందో, ఏమి విసుక్కుంటాడో అన్న భయం ఆమెనోటికి తాళం వేసింది. రాత్రి తొమ్మిదింటికి క్లబ్బునుంచి చౌదరి వచ్చాడు. శ్యామల ఏమో అడుగుదా మనుకుంటుంది; మళ్ళీ అడగలేకపోతుంది. చివరకు పోనీ, రే పడుగుదాంలే అని ఊరుకుంది.

మర్నాడు గడిచింది; మరినాలుగు రోజులు గడిచినై. శ్యామల నోరు మెదల్చలేకపోయింది. అనుక్షణమూ అక్కడ అమ్మ కెలా ఉన్నదో అన్న ఆందోళనే ఆమెకు. ఆ చింతచేత ఆమె ఇంటిపనులపట్ల కొంచెము అశ్రద్ధ చూపినమాట నిజం. అన్నం బిరుసైందనో, కూరలో ఉప్పు చాల్లేదనో, గది పరిశుభ్రంగా

లేదనో ఆమెమీద తప్పుపట్టి చౌదరి కోపగించుకోవటం సంభవించింది.

ఒక్కొక్కరోజున రాత్రి తొమ్మిదింటికి ఆయన క్లబ్బునించి హుషారుగా ఇంటికి వస్తే, శ్యామల తల దువ్వుకోటం కూడా మరచి నిరుత్సాహంగా, చింతా వివశయ్యి, పడుకుని వుండటం అతనికి కష్టం కలిగించేది. తండ్రివెంట పుట్టింటికి పంపలేదన్న కోపంచేత అలాగ పెంకెగా ప్రవర్తిస్తోందని భావించి ఎత్తిపొడుపుమాట లనేవాడు; ఆమె మరింత బాధ పడేది.

చివర కొకనాడు నాయుడుగారి దగ్గరనించి ఉత్తరం వచ్చింది. చౌదరి చదువుకుని శ్యామల కిచ్చాడు. ఆమె ఆదుర్దాతో ఒక్క చూపులో అంతా చదివేసి "ఏమంటారు మరి" అన్నది.

"ఏమనేదీ ఏముంది?"

"ఒక్కసారి వెళ్ళొస్తాను."

"కాస్త సందు దొరికితే సరి, రెక్కలు కట్టుకుని ఎప్పుడు ఎగిరిపోయి పుట్టింటో వాలుదామా అని నీ ఉద్దేశం"

"మీరు మహా ఎన్ని సార్లయినా పంపించేవా రసి"

ఆమె కటము లదరినై; కనుగొలకులు వింతగా ప్రకాశించినై; కోపం వచ్చినట్టు తెలుస్తోనే ఉంది.

ఆ మాట బాణంలాగుపోయి చౌదరి హృదయంలో గుచ్చుకుంది. అన్నాడు: "మాటలు దూకుడుగా వస్తున్నాయే!"

"ఈ ఉత్తరం చూస్తే రాళ్ళుకూడా కరుగుతై"

"ఔను. నేను రాక్షసుణ్ణే. మీ నాన్నకూడా అలాగే ప్రపంచమంతా చాటిస్తున్నాడు. బీదకుటుంబంలో పుట్టి, తనవంటి ధనవంతుల ప్రాపకంచేత చదువుకుని పైకి వచ్చారుట. అంచేత నాకు గర్వం బలిసిపోయిందిట. చెడిబతికినవాణ్ణి కాబట్టి నావి నీచగుణాలుట".

"మధ్యన తంపీలు పెట్టేవాళ్ళ మాటలు విని మీ రాయనమీద విరోధం పెంచుకుంటున్నారు."

"మీ నాన్నమాత్రం మంచివాడే, ఏం? ఆయన తరఫున వకాల్తా పుచ్చుకు మాట్లాడ్డం నీ కలవాటేగా! చేసుకున్న భార్యవు నువ్వే అనగాలేనిది, ఆయ నవటం లెక్కొచ్చిందీ?"

"ఇంతకూ ఏమంటారు మరి? ఉత్తరం చదివారు కదా, మొన్న రాత్రంతా మాఅమ్మకు స్మృతేలేదుట. దగ్గు, ఆయాసం ఎక్కువగా ఉందిట. నే నొకసారి వెళ్ళాలి, తప్పదు"

ఇటువంటి ధోరణిలో ఇంతసేపు తనతో శ్యామల ఎన్నడూ మాట్లాడలేదు. ఇవాళ ఆమెకవళిక, కంఠధ్వని, మాటలు—అన్నీ తనతో యుద్ధానికి బయలుదేరినట్టు కనిపించినై; చౌదరికి కోపం వచ్చింది.

"చెబితే వినకపోయినతర్వాత నీఖర్మం. వెళితే వెళ్ళు. నీయిష్టం" అని ఆమెతో సర్వసంబంధాలూ వదులుకున్నవాడు వలె మాట్లాడి ఆఫీసుకు వెళ్ళిపోయాడు చౌదరి.

మనస్ఫూర్తిగా భర్త అనుజ్ఞ యివ్వనిదే తా నెలా వెళుతుంది? వెళ్ళకండా—ఎలా ఉంటుంది? శ్యామలమనస్సు ఎంతో మధనపడ్డది.

చిత్తస్వాస్థ్యం మీద దేహారోగ్యం ఆధారపడి వుంటుం దన్నమాట నిజం. సాయంత్రం చౌదరి ఆఫీసునించి వచ్చి నప్పుడు శ్యామల తలనొప్పితో బాధపడుతూ పడుకుని ఉంది. అది చూచి చౌదరి అన్నాడు; "ఆడవాళ్లు తమ పట్టుదల నెగ్గించు కోటానికి ఎన్నివేషాలైన వేస్తారు సుమా!"

ఆదరణ లేకపోగా ఇలాంటి మాటలా? శ్యామలకు చాల కష్టమనిపించింది. ఊరుకోలేక "మీరు తెలియకండా మాట్లాడకండి, నాకు కోపం వస్తుంది." అని విసుగ్గా అంది"

"అయితే డాక్టర్ని పిలవమంటా వేమిటి?" వ్యంగ్యంగా ధ్వనించినై చౌదరిమాటలు.

"మీకు నాసంగతి పట్టిందీ? వెళ్ళండి, క్లబ్బుకు టైమ యింది కావాలు!" ఆమెకన్నులు చెమ్మగిల్లినై.

రాత్రి తొమ్మిదింటికి చౌదరి క్లబ్బునించి వచ్చినప్పుడు శ్యామల దుప్పటి కప్పుకు పడుకుని, చలితో వొణుకుతూ, మూలుగుతూ ఉంది. ఒళ్ళు పట్టుకుచూస్తే కాలిపోతోంది. చౌదరి వెంటనే డాక్టర్ని పిల్చుకు వచ్చాడు.

డాక్టరు శ్యామలను పరీక్షించి, అది వట్టి మలేరియా జ్వరమేననీ, అంత భయపడవలసిన అవసరం లేదనీ చెప్పి వెళ్ళాడు; ఇంత 'క్వినైన్ మిక్స్చరు' పంపాడు.

*　　*　　*

రాత్రంతా శ్యామల ఏమేమో కలవరించింది. మర్నాడు ఉదయానికి జ్వరం కాస్త తగ్గింది. లేచి పనీ, పాటా చేసింది.

కాని సాయంత్రానికి మళ్ళీ జ్వరం పెట్టుకువచ్చింది. వరుసజ్వరం కదా, ఉదయానికి తీస్తుందేమో అనుకుంది. కాని తీయలేదు. పైగా మూడోనాటి సాయంత్రానికి బాగా 'టెంపరేచరు' హెచ్చిపోయింది. ఒళ్లు అగ్గిలాగు కాలిపోతోంది.

డాక్టరు వచ్చి "మలేరియా జ్వరానికి అంత పెద్ద 'టెంపరేచరు' రావటం కద్దు లెండి, పరవాలేదు" అని ధైర్యం చెప్పి వెళ్లాడు; మందు పంపాడు.

జబ్బుగా ఉన్నప్పుడు మానవహృదయం వెన్నముద్దవలె అయిపోవటం సహజం. జీవితంలో తాము చేసుకున్న పాపాలకు పశ్చాత్తాపపడతారు రోగులు. భర్త సాయంత్రమప్పుడు ఆఫీసునించి యింటికి రాగానే శ్యామల ఆయన్ను దగ్గరకు పిల్చి, తన మంచంమీద కూచోండని సైగచేసి ఆయన కేసి దీనంగా చూస్తూ అన్నది :

"మా నాన్నగారి ఉత్తరం వచ్చినరోజున నేను కొంచెం దుడుకుగా మాట్లాడాను. కోపంలో నా కేమీ తెలియలేదు. మీరు మనసులో పెట్టుకోకండేం! క్షమించండి."

ఆమాటలతో చౌదరిలోని దురభిమానం ఇగిరిపోయింది. శ్యామల తన కెంత ఆవశ్యకమైన వస్తువో తెలుసుకోగలిగాడు. ఆమె కర్పించవలసిన — హృదయంలో ఇన్నాళ్ళనించీ దాగివున్న ప్రేమనిధుల్ని చూచాడు. ఆమె పక్కనే కూచుని, మృదువుగా

అనునయంగా చాలసేపు మాట్లాడాడు. ఆ సాయంత్రి మతడు క్లబ్బుకు వెళ్ళలేదు. మాటల సందర్భంలో "నీ జ్వరం నయం కాగానే ఒకసారి వెళ్ళి మీ అమ్మను చూచివస్తువు గానిలే" అనికూడ అన్నాడు. ఒక్కొక్కప్పుడు కఠినుడుగా కనిపించినా, ఆయన మనసు చాలమెత్తనిదే నని శ్యామల సంతోషించింది.

* * * *

రాత్రి పదకొండయింది. చౌదరి పడకకుర్చీలోనే నిద్ర పోతున్నాడు భార్య మంచంపక్కన. ఆమె కింకా కునుకు పట్ట లేదు. జ్వరతీవ్రత, తలపోటు, ఒళ్ళునొప్పులూ — ఆమె కయోమయావస్థగా ఉంది.

భర్తను లేపి, పక్కన కూర్చోమని ఏమన్నా మాట్లాడు తోంటే బాధోపశమనంగా ఉంటుందేమో ననిపించింది. కాని ఆయనకు నిద్రాభంగం చేయుట మిష్టం లేకపోయింది. తన ఆలోచనలనే చూచుకుంటూ పడుకుంది.

సాధారణంగా అందరు రోగులకుమల్లేనే శ్యామలకు కూడా అప్పుడు ఒకసారి తనబాల్యావస్థ స్మృతిపథంలో మెరి సింది. ఏ బాధలూ సోకనీకండా — ఏ కష్టాలూ కలగనీకండా — సౌఖ్యప్రదమై — ఆనందమయమై — తన బాల్యజీవితానికి ఆశ్రయమైన ఆ తల్లియొడి తనకు మళ్ళీ ఇప్పు డొకసారి లభిస్తే ఈజ్వరం నిమిషంలో మాయమైపోదూ! కాని ఎలా లభిస్తుంది? ఆమె కక్కడ ఎలాగ ఉందో మరి. పాపం! వెళ్ళి ఆమెను చూడాలి, చూడాలి.

కొంతసేపటికి ఆలోచన లన్నీ ఆగిపోయి, శ్యామలకు కాస్త నిద్రపట్టింది. కాని అది నిద్రకాదేమో అన్న అనుమానం ఆమెకే కలిగింది. దేశకాల పరిమితి నతిక్రమించిన ఒక విచిత్రానుభవం తనకు కలుగుతోంది—

అంత స్వల్పకాలంలో, అంత దూరాన ఉన్న పుట్టింటి కెలా వచ్చానా అని ఆశ్చర్యపడ్డది. ఔను; అది నిజంగా పితృగృహమే. అరుగో! నాన్నగారు మడతమంచంమీద నిద్రపోతున్నారు. ఆ పక్కనే మంచంమీద వ్యాధిగ్రస్తయై మాతృదేవి! అయ్యో! ఎంత కృశించి పోయింది?...

మిణుకు మిణుకు మంటోన్న దీపం ఆరిపోయింది. అక్కడ హాల్లో అంధకారం. ఆ కటికచీకటిలో మృత్యుదేవత పిలుపువలె గోడగడియారం పన్నెండు కొట్టింది....

నాయుడుగారు ఉలికిపడి లేచి 'ఏమిటి?' 'ఏమిటి?' అంటూ భార్యమంచందగ్గరకు వచ్చాడు. జవాబు లేదు. ఆ చీకటిలో అలికపట్టంమీద అగ్గిపెట్ట వెదకి దీపం వెలిగించాడు.

భార్య పెదవుల్ని గట్టిగా మూసుకుని — వస్తోన్న దగ్గును ఆపుకోటానికి ప్రయత్నిస్తోన్నట్టుగా పడుకుని ఉంది; శిరోజాలు విడిపోయి దిండుమీద పర్యాకులములై ఉన్నవి; ముఖ మంతా కందిపోయింది......

జీవనజ్యోతి యింకిపోయిన నేత్రాలతో "అయ్యో! ఇక మిమ్మల్ని విడిచిపోతున్నా" నన్నట్టు దీనంగా ఆయనకేసి చూస్తున్న దామె......

చివరకామెకు తుపాకి పేల్చినట్టుగా దగ్గు వచ్చేసింది. కళ్లలో నెత్తురు జీర!......

చమురులేక ఆరిపోతోన్న దీపాన్ని చేత పట్టుకొని నాయుడు గారు కర్తవ్యతామూఢుడై, కన్నీళ్లు విడుస్తూ, రాపడి పోతూడు. ఆమె ఆయనకేసి దీనంగా చూస్తో ఒత్తిగిలి పడుకుంది.......

ఇంతలో మరొకసారి దగ్గు వచ్చింది. ఆ దగ్గటంలో మోకాళ్ళు వచ్చి గడ్డాని కానుకున్నవి. సెలవులవెంట కారి గడ్డమంతా—నెత్తురుతో సగపాలు మిళితమైవున్న కళ్ళెతో పూడి పోయింది......

నాయుడుగారు మనసా భగవంతుణ్ణి స్మరిస్తున్నట్టుగా కనిపించాడు. భార్య చనిపోతే తన కీ ప్రపంచంలో ఏ మున్నది— అన్నట్టుగా విచారభావద్యోతకములైనవి కన్నులు......

ఆమె ఇక పెదవుల్ని గట్టిగా నొక్కిపెట్టి ఉంచలేక పోయింది. నెత్తురు నోటివెంట వడివడిగా ప్రవహింప సాగింది. "లాభం లేదు; భగవంతుడు నిర్దయుడు" అన్నట్టుగా చూచాడు నాయుడుగారు......

ఆమె ఇంకోసారి దగ్గింది ... హఠాత్తుగా ఒక్కసారి పక్కమీద లేచి కూచుంది... వెంటనే మళ్ళీ వెనక్కి పడి పోయింది...

*   *   *   *

ఈ కరుణదృశ్యానికి శ్యామల నిలువునా కరిగిపోయింది. పెద్ద పెట్టున ఏడుద్దామనుకుంటుంది. కాని కంఠం పెగలదు. దుఃఖమంతా కంఠందగ్గర గూడు కట్టుకుంది. మాతృదేవి మరణం చూడలేకపోయింది.

"అమ్మా! నేనూ వస్తున్నా" అని కంఠం పెగల్చుకు వచ్చిన రోదన చౌదరిని మేల్కొల్పింది. అతడు ఆదుర్దాపడి లేచాడు. మంచంమీద పడుకునిఉన్న శ్యామల నేలమీదపడి ఉంది. ఆ పడటంలో కాలు తగిలి అక్కడ ముక్కాలిబల్లమీది దీపం కిందపడి ఆరిపోయింది.

"శ్యామా! శ్యామా!"

అందుకు జవాబుగా అక్కడి ప్రతిఅణువూ బీభత్సంగా శబ్దించింది:

"నేనూ వస్తున్నా—"



# ఫొటో

"మీరు 'ఫొటో' తీయించుకుంటారూ!"

సుఫియా బేగం కాపురానికి వచ్చి ఆరునెల లయింది; ఆమె అలాగ భర్తను కోరటం మొదటిసారి కాదు.

ఆనాటిమాత్రం అజాద్ చదువుకుంటోన్న 'కురాన్' పుస్తకం మూసేసి, ఆమెకేసి తీక్షణంగా చూస్తూ, చాలకోపంగా మాట్లాడేడు; "నువ్వు మనిషివా; పశువ్వా? ఎన్నిసార్లని చెప్పను, అది మనకు తగదని!" అంటూ ఆ ఉద్రేకంలో ఏమేమో అన్నాడు. 'మరొకసారి ఆ ప్రసంగం ఎత్తావంటే జాగ్రత్త!' అన్నట్టుగా చూశాడు.

ఆమె మనస్సు చివుక్కుమన్నది. అజాద్ మళ్ళీ కురాన్ పుస్తకం తెరచాడు. సుఫియా నేత్రాలు బాష్పపూరితాలు కాగా ముఖం తిప్పుకొని పడకగదిలోకి వెళ్ళిపోయింది.

కాపురానికి వచ్చిన కొత్తలో ఒకనాడు తాను పడకటింటి గోడలన్నీ పుట్టింటినించి తెచ్చుకున్న 'ఫొటో'లతో అలంకరించింది. కొన్ని వివిధదశలలో తాను తీయించుకున్నవి; కొన్ని అన్నగారు సొంత 'కెమేరా'తో తీసిన ప్రకృతిచిత్రాలు; (ఆయనకు బి. ఏ ప్యాసైనప్పటినించీ అదే ఉద్యోగం); మరికొన్ని తాను చదువుకున్న కాన్వెంటు స్కూలుకు సంబంధించినవి. అన్నీ అలంకరించి, చూచుకుని సంతోషిస్తోండగా భర్త వచ్చాడు. పడకగది కబ్బిన నూత్నశోభను ఆనందించి తన్నభినందిస్తాడనుకుంది. కాని ఆయన 'ఏమిటీ పిచ్చి' అని ప్రశ్నించాడు.

"చూడండి! ఎంత చక్కగా ఉన్నాయో! ఆ ప్రకృతి చిత్రాలన్నీ మా అన్నయ్య తీసినవే. వాడికి అస్తమానమూ అదేపని. ఎన్నిఉన్నా మీ 'ఫోటో' ఒక్కటైనా లేకపోవటం నాకు——" అన్నంతలోనే అజాద్ అందుకుని "ఇంకేం, అన్నకు ప్రకృతిపిచ్చే చెల్లెలికి పుట్టింది. అవన్నీ తీసి వెయ్యి, తెలిసిందా!" అన్నాడు.

"మీకు బాగు లేవూ?"

"మన మతం వొప్పుకోదు"

అలాగని అజాద్ వెళ్ళిన మరుక్షణంలోనే పడకటింటి గోడలన్నీ పూర్వపు శ్వేతదిగంబరత్వాన్ని పొందినై. 'ఫోటో' లన్నీ ఇన్నాళ్ళనించీ ఆమె పెట్టెలోనే అణిగిపడి ఉన్నాయి.

ఇవాళ మళ్ళీ సుగయా వాటన్నిటినీ ఒక్కొక్కటి బైటికి తీసి చూచుకుంటోంది. 'కాన్వెంటు' స్కూల్లో చదువుకుంటూ, తండ్రిగారి పోషణలో ఉన్నప్పటి తన బాల్యజీవితంలోని కొన్ని మధుర సన్నివేశాల్ని ఆ ఫోటోలు జ్ఞాపకం చేసినై. ఆమెకు చాల సంతోషమయింది. కాని ఆ సంతోషంలోనే — తన భర్త గారి ఛాయాచిత్రం ఒక్కటైనా లేదే అన్నచింత ఒకటి మొదట అస్పష్టంగా ఉద్భవించి చివరకు ప్రస్ఫుటమయింది. టేబిల్ మీద ఉన్న పొరలచక్క 'ఫ్రేము' కేసి దీనంగా చూచింది. ఎన్నాళ్ళో శ్రమపడి తా నది ఎంతో అందంగా తయారుచేసింది; అందులో మగని ఛాయాచిత్రం అమర్చి చూచుకుంటేనే తప్ప ఆమెకు మనస్తృప్తి కలిగేట్టు లేదు.

కాని అజాద్ 'మతం','మతం' అంటాడు. ఏమిమతమో ఏమిగొడవో తన కేమీ అర్థంకాదు. 'ఫొటో' తీయించుకోక పోవటమూ, సినిమాలకు వెళ్ళకండా ఉండటమూ, గడ్డం పెంచు కోవటమూ — ఇత్యాదులేనా మత మంటే! గవర్నమెంటు ఉద్యోగంచేస్తూ, పాశ్చాత్యనాగరికతకు అలవాటుపడ్డ తండ్రి గారి యింటో తా ననుభవించిన స్వేచ్ఛకు శృంఖలాలు తగిలించాడిప్పు డజాద్. ఘోషా అలవాటు చేసుకోవలసి వచ్చింది. సినిమాలకు వెళ్ళాలన్న కోరిక అణచివేసుకోవలసి వచ్చింది. అడుగడుక్కీ మతాచారం తర్జని చూపెడుతోంది.

ప్రపంచ మంతా ఫేషన్ దేవతకు బలి ఔతోంటే తాముమాత్రం నైతికంగా నిల్చియున్నా మనుకుని గర్వపడే వాళ్ళలో అజాద్ ఒకడు. ఒకప్పుడు తోసివేయటానికి వీల్లేక పోయిన పూర్వబాంధవ్యం, తండ్రిగారి బలవంతం — ఇవి రెండూ లేకపోతే 'కాన్వెంటు' స్కూల్లో హాన్మెర్దో 'స్టాండర్డు' చదువుకొన్న పిల్లను చేసుకునేవాడే కాదు. ఇంగ్లీషుచదువుకొన్న పిల్ల భర్తమనసున కెక్కగలదన్న నమ్మకం అతని కెన్నడూ లేదు. కాని ఈ అభిప్రాయం తాను మార్చుకోవలసి వుంటుందేమో అన్నట్లుగా ప్రవర్తించింది సుషమా. అలా మార్చుకోటం అతని మనస్సుకిష్ట మున్నట్లు కనిపించలేదు. సర్వసాధారణంగా అన్వయించే 'రూలు'కు సుషమా ఒక్కతే వ్యతిరేకమైతే కావచ్చుని సమాధానపడేవాడు.

సుషమా తన అందంచేతా, వినయగుణంచేతా, అజాద్‌ను తనకేసి ఆకర్షించుకుంది. మొదటిరోజుల్లో అత నంటే

భయంవేసేదే కాని రానురాను మంచి చను వేర్పడ్డది. అజాద్ నైతికదృష్టికి ఇతర్లలో తప్పులు చప్పున కనిపించేవి; అంచేత చిన్నది, మంచి సరదాపిల్ల అయిన సుషమకూ ఆయన ముందర లింపులూ, నైతికోపన్యాసాలూ అలవాటైపోయినై.

ఇంకొకతె అయితే అజాద్‌ను వెర్రిపుల్లయ్యకింద కట్టివేసి ఉండును. కాని సుషమకు ఆయనంటే ఎంతో గౌరవం. గొప్ప భక్తుడనీ, సామాన్యమానవులకంటే ఆధ్యాత్మికంగా కొన్ని మెట్లు పైనే ఉన్నాడనీ ఆమె యభిప్రాయం. అతడు కన్నుమూసుకుని 'నమాజ్' చేస్తుంటే ఆమె రెప్పలు వాల్చకుండా అతనిలో అల్లాను చూస్తూ తన్మయురాలయ్యేది — ఆ దేవుడికి తన ప్రేమహృదయం ఉపహారం ఇచ్చి.

అజాద్‌కు నచ్చనిపని చేయటం తనకిష్టం లేదు. టేబిల్ మీది పొరలచక్క 'ఫ్రేము' గారి ఛాయాచిత్రం సహింపనై ఉండటమూ తనకిష్టం లేదు. 'సినిమాకు తీసుకువెళ్ళరూ' అనే ప్రశ్న ఏనాడో మానేసింది. కాని 'మీరు ఫోటో తీయించుకుందురూ!' అని కోరకుండా ఉండలేక పోతోంది...

తీసిన ఫోటో లన్నీ మళ్ళీ పెట్టెలో సర్దుతోండగా హాల్లో గచ్చునేలమీద ట్రంకుపెట్టె దించిన చప్పుడు వినిపించింది సుషమకు. తరువాత ఎవరిదో బూటు చప్పుడు. ఆపైన "ఇప్పుడేనా రావటం" అని భర్తగారి ప్రశ్న. అందుకు "ఔను; ఈ తొమ్మిదిగంటల బండికి దిగాను" అని పరిచితకంఠధ్వని జవాబు.

సుషమా చివాలున లేచి ఒక్కగంతులో హాల్లోకి వచ్చేసింది. బండివాడు కిరాయి తీసుకుని వీధిగుమ్మం దాటి వెళ్ళిపో

తున్నాడు. ఒక్క చేతిలో అప్పుడే తలమీదినించి తీసిపట్టుకొన్న, మరొకచేతిలో 'కెమేరా' పెట్టెని అన్నగారు తనకేసి చిరునవ్వుతో చూస్తూ "నాకు ఫొటోగ్రఫీ ఇలాగా ఉద్యోగం దొరకిందమ్మా! ఒకవారం రోజుల్లో 'డ్యూటీ' పుచ్చుకోవాలి. బొబ్బిలి వెళుతున్నాను. దారిలో మిమ్మల్ని చూచిపోదాంగదా అని ఇక్కడ దిగాను" అన్నాడు.

కుశలప్రశ్నలైన తర్వాత "కెమేరా కూడా తెచ్చావే" అని సుభద్రా నవ్వుతూ అడిగింది.

"అది మనవెంట సదా ఉండవలసిందేగా" అన్నాడు అన్నగారు.

"ఔను మరి పాపం! ప్రాణులకు అన్నం, నీళ్ళు లేకపోతే యేమౌతుందో, మనవాడికి 'కెమేరా' లేకపోతే కూడా అంతే" అని బావగారి పరిహాసం.

"నీకు తెలీదు ఊరుకోవోయి బావా! ఎప్పటివో క్రీస్తుపుట్టనికాలంనాటి మాటలు చెబుతావు. 'ఫొటోగ్రఫీ' కూడా ఒక కళ—తెలుసునా?"

"ఔను. నువ్వు మంచి కళావంతుడివిలే" అని నవ్వేసి అజాద్ 'ఖురాన్' చదవటంలో పడ్డాడు.

సుభద్రా అన్నగార్ని వంటింట్లోకి తీసికెళ్ళి, పుట్టింటి కబుర్లడుగుతూ రుచ్యములైన పదార్థాలు వండింది.

... ... ...

అన్నగారు ఉన్న నాలుగైదు రోజులూ అతనితో 'కేరమ్సు' ఆడుతూనో, కబుర్లు చెబుతూనో, కులాసాగా కాలం

వెళ్ళిబుచ్చుతోంది సుషమా. "చూచావా, అన్నగారు రావటం తోనే తనకేసి తిరిగన్నా చూడలేదు సుషమా; అసలు తన ఉనికే మరచిపోయిన్నుంది" అనుకున్నాడు అజాద్. వాళ్ళ ఆటపాటల్లో, నవ్వుల్లో తాను కూడా పాలు తీసుకునే శక్తి లేకపోగా, అది తప్పుగా పరిగణించటము అజాద్‌వంటి నైతిక మన స్తత్వం కలవాళ్ళకు పరిపాటికావాలు!

బావమరది నాలుగైదురోజు లుండి ఊళ్ళికి ప్రయాణ మైనాడు. స్టేషన్‌దాకా వెళ్లి, అతన్ని రైలెక్కించి, అజాద్ ఇంటికి తిరిగి వస్తూ—సుషమా ఈ నాలుగైదు రోజులనించీ తనపట్ల చూపుతోన్న 'కృతఘ్నతకు' కించపడ్డాడు. అన్నగారి పాటి చేయలేదా తాను? అన్నగారేమో, తానేమో తప్ప వేరే ప్రపంచమే లేనట్టు ప్రవర్తించింది. ఆ మాటలూ, ఆ కిలకిల నవ్వటాలూ, ఆ గుసగుసలూ ఏమన్నా బాగున్నై? తను రాగానే ఆ గుసగుసలు ఆపివేశా రెందుకో; అకేసి పైగా సుషమా తనకేసి ఒకరకంగా చూస్తూ నవ్వింది, ఆ నవ్వులో క్రొంటెతనం ఉంది. తన్ను అవమానించటం కాని అది? నాగరకతాపిశాచం ఆడిస్తోన్న ఆట !...

అజాద్ ఇల్లు చేరుకున్నాడు. అస్తమిస్తోన్న సూర్యుని కిరణాలు పడమటివేపు కిటికి గుండా ప్రవేశించి హాల్లోని గచ్చు నేలకు బంగారుపూత వేస్తున్నై. కోటు విప్పి వంకెకు తగిలి స్తోంటే అజాద్‌కు పడకగదిలోనించి ఏవో మాటలు వినిపించినై:

"ఇన్నాళ్ళనించీ నే నెంత తపిస్తున్నా నాప్రార్థన విన్నారూ? ఇవాళ చిక్కిపోయారు లెండి!"

అది నిస్సందేహంగా సుషమా కంఠధ్వని. మరి ఆ రెండో వ్యక్తి ఎవరు? అతనికోసం ఎన్నాళ్ళనించో తపిస్తోందిట! దుర్మార్గురాలు!—అజాద్ ఒడలంతా తేళ్ళూ, జెర్రులూ పాకినట్లయింది.

మళ్ళీ లోపల :

"మీరు నా హృదయాధినాథులు. మిమ్మల్ని ఈ పూల మాలతో అలంకరిస్తా, ఏం?"

ఏమిటీ? అంత ఉన్మాదమా? అంత సాహసమా!— అజాద్ హృదయంలో దావాగ్ని ప్రజ్వలిత మయింది.

మళ్ళీ లోపలనించి :

"ఎంత అందంగా ఉన్నారండీ! అతిలోకమోహనాకారం! మిమ్మల్ని నా గుండెలో దాచుకుని ముద్దులతో—" అః, అల్లా! — ఇక అజాద్ అక్కడ నిలువలేకపోయాడు. కన్నుల్లో క్రోధారుణచ్ఛాయ కమ్ముకుంది. పెదవి కొరుక్కున్నాడు. కింద పడిపోతాడేమో అన్నట్లుగా లోపలికి పరుగు పెట్టాడు. ఎందుకో ఏమి చేయబోతున్నాడో అతనికే తెలీదు.

అతడు పడకగదిగుమ్మం చేరకముందే... తనివితీరని ముద్దుల చప్పుడు... ఒళ్లు జలదరింపచేస్తోన్న కిలకిల నవ్వు... అజాద్ గుమ్మంముందు ఆగి చూచాడు. పూలమాలతో అలంకృతమైన హారలచక్ర 'ఫ్రేము' వక్షోభాగాన రెండు చేతుల్తో అదుముకుని, ప్రేమపారవశ్యంలో కన్నులు మూసి, పక్కమీద యోగముద్రలోవలె ఉంది సుషమా.

"సుషమా!"

ఉలికిపడి లేచిందామె. వెంటనే భర్తేకదా అని తెలుసుకుని, లేచి, చిరునవ్వు చిలుకుతూ, శృంగారలజ్జ అభినయిస్తూ, "చూడండి, మీ 'ఫోటో' ఎంత అందంగా ఉందో! మొన్న సాయంత్రం మీరూ, మా అన్నయ్యా పొలాలకేసి షికారు వెళ్లినప్పుడు, మీకు తెలియకుండానే మీ ఫోటో తీశాట్ట. దీని కోసమే మే మానాడు అంతగా గుసగుస లాడుకుంది. మీరు చూచి కొంచెం కోపంకూడా తెచ్చుకున్నట్టున్నా రప్పుడు. చూడండి, బాగులేదూ ఫోటో" అంటూ ఎదురుగా వచ్చి ఫోటో ఎత్తిచూపెట్టింది.

అలాగ ఎదురుగా నిల్చి తన కన్నుల్లోకి చూస్తోన్న సుఫయా నేత్రాల్లో ప్రేమజ్యోతి నిశ్చలంగా ప్రజ్వలిస్తోంది. దివ్యప్రేమ - ఆకారంగా నిల్చివున్న ఆమె అతని కెంతో అందంగా కనిపించిం దా సమయాన. తన 'కురాన్' పఠన, పూర్వాచార పరాయణత్వం, నైతికనిష్ఠ—ఇవన్నీ తనను వట్టి అనుమానం మనిషినిగా తయారుచేసినై. సుఫయా ప్రేమలోనిఆనందాన్ని అవలీలగా తనవశం చేసుకుంది. తానో, వట్టి అనుమానం మనిషి కాదూ! ఎన్ని పశ్చాత్తాప అశ్రువులతో తన హృదయంలోని మాలిన్యం క్షాళితం ఔతుంది!

ఇంతకూ ఆమె ఇన్నాళ్లనించీ కామించి, చివరకు పొంది, చూచుకుని అపరిమితానందం అనుభవిస్తోన్న ఆ 'ఫోటో'ను చించి పారేయమని అజాద్ అనలేకపోయాడు.

*
* *



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104B175 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |